# దగ్గు గప్‌చిప్

## వచ్చేసింది
## నమ్మకమైన మందు
## కొత్త ప్యాక్‌లో

Alembic
Glycodin
ग्लायकोडिन
टर्प वसाका
TERP-VASAKA
COUGH SYRUP
खांसी की दवा

Dosage
Adults: 5 ml
(one teaspoonful)
three or four times a day.
Children:
1 to 4 years: as advised
by the physician.
4 to 6 years: 1.25 ml
(1/4 teaspoonful).
7 to 12 years: 2.5 ml
(1/2 teaspoonful).
three or four times a day.

Caution:
It is dangerous
to exceed
the stated dosage

170 ml.

Alembic
Glycodin
TERP-VASAKA
COUGH SYRUP
ग्लायकोडिन टर्प वसाका खांसी की दवा
ALEMBIC CHEMICAL WORKS CO. LTD.
MADE IN INDIA

గ్లైకోడిన్ అలాంటి, ఇలాంటి మామూలు దగ్గు మందుకాదు. భారత దేశంలో దగ్గు చికిత్సకోసం వాడే మందులలో దీనిది ప్రథమ స్థానం.

**గ్లైకోడిన్ అన్ని రకాలైన దగ్గులనుంచి శమనాన్నిస్తుంది.**

- మెదడులో, దగ్గాలని అనిపించే కోరికను కలగనివ్వదు.
- ఛాతీలో, పట్టుకునేలాంటి అసౌకర్యాన్ని దూరంచేసి విశ్రాంతినిస్తుంది.
- గొంతులో, గరగరలాడటంనుంచి ఉపశమనం యిస్తుంది.
- ఊపిరితిత్తుల్లోని, కఫాన్ని బయటకు తెచ్చేస్తుంది.

**బాధపెట్టే, అసౌకర్యపరిచే అన్ని రకాల దగ్గులనుంచి శమనానికి గ్లైకోడిన్‌ని విశ్వసించండి**




అలెంబిక్—డాక్టర్లకు వీరి మందులపై విశ్వాసం ఉంది.

# గ్లైకోడిన్ దగ్గుల్ని తగ్గించడంలో భారతదేశంలో ముందడుగు.

everest/78/ACW/236-tl




**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 1972]
శుక్రవారం : 23 11 '79
సిద్ధార్థినామ సం. మార్గశిర శు. చవితి
**సంపుటము 73 · సంచిక 13**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

చిన్న సందు. అక్కడ వొక మడిగె, తొమ్మిదినుంచి పన్నెండు, నాలుగునుంచి ఎనిమిది అన్న బోర్డు, సున్నం కొత్తగా వేయించి షట్టర్ మీద ఎర్ర క్రాస్ పెయింట్ వేయించి వొక మంచి ముహూర్తలో ఆ వీధిలో ఉండే పెద్ద వాళ్ళను పిలిచి చిన్నతరహా వోపినింగ్ సెర్మనీ లాంటిది చేయించి స్వీటు, హాటు, టీ యిచ్చేడు కొత్తగా డిగ్రీ పుచ్చుకున్న డాక్టరు సుదర్శనం.

డిస్పెన్సరీ ముందు చిన్న డేరా లాంటిది వేసి అందులో కొన్ని కుర్చీలు వేయించేడు వచ్చె వాళ్ళు కూర్చొనేందుకు మొదట మైక్ పెట్టి రికార్డులు కూడా వేద్దాం అనుకున్నాడు అతనికి తెలిసిన వాళ్లు అది యితర షాపులకైతే అలా చేయొచ్చు అంతేకాని డిస్పెన్సరీకి తగదు అంటూ సలహా యిచ్చేరు.

అతను పిలిచిన వాళంతా రాగానే కంగ్రాట్యులేషన్స్ అనడం, వెళ్ళేటప్పుడు ఆల్ ది బెస్ట్ అని తిరిగి కరచాలనం చేయడం.

ఆ వీధిలో అందరికంటే కొంచెం సుకలాయన, ఆస్పిటలోంచి రిటైరయినా ఇలాంటి ఫంక్షన్స్‌లోంచి సూత్రం,రిటైరు కాని నరహరి చిన్న సైజు ఉపన్యాసం లాంటిది కూడా యిచ్చేడు దాని సారం ఆ వీధిలో వాళ్ళు డాక్టరు లేక చింతో యిబ్బంది పడుతున్నారని, ప్రక్క వీధిలోని డాక్టర దగ్గరికి వెళ్ళాలంటే అతికష్టంగా ఉందనీ, ఇప్పుడు డాక్టరు సుదర్శనం ప్రాక్టీసు పెట్టడంనించి వాళ్ళకు పెద్ద బెంగ తీరిపోయిందనీ మాట్లాడి తినవలసిన వన్నీ తినేసి తాగవలసినవన్నీ తాగేసి– 'డాక్టర్ నా కంటే చిన్నవాడివి అయినా పెద్ద చదువే చదువుకున్నావ్! నీకేంటి నాకు సలహా యివ్వడం అనుకునేవ్. డెబ్బయి అయిదేళ్ల

## సీరియల్ ప్రారంభం!

జీవిత అనుభవం చూసినవాడ్ని గనుక యీ మాట చెబుతున్నాను. మొట్ట మొదటే ఛార్జీలు అతిగా వేసేకు. కొంచెం చూసి వేయి. మనకు మొదట్లో కావలసింది డబ్బు కాదయ్యా! పేరు, జనం, యీ రెండు వచ్చేక ఉన్నా చూసుకో. డబ్బు దానంతట అదే వచ్చేస్తుంది పేదవాళ్ళ దగ్గర కొంచెం పిండ, ధనవంతుల దగ్గర బాగా గుంజేయ్. మా లాంటి ముసలివాళ్లని పెద్దవాళ్లని కాస్త కనిపెట్టుకుంటూండు వృద్ధిలోకి









వస్తావ్' అని 'బాబూ కొంచెం ఒంట్లో నీరసంగా ఉంటోందోయ్! ఏదైనా టానిక్ శాంపిల్ టానిక్కులు వొస్తే తీసిపెట్టు' అని 'అప్పుడప్పుడు వచ్చి నీలా జరుగుతుందో చూసి వెళుతూంటానులే మా యింటి చుట్టు ప్రక్కల వాళ్ళకు చెప్పి అందరినీ యిక్కడికే పంపిస్తాను' అంటూ అతను వెళ్ళిపోయేక.

ఏడు తర్వాత జనంరావడం కొంచెం పల్చబడ్డారు. ఎనిమిది తర్వాత నెవరూ రాలేదు నిర్మానుష్యంగా ఉన్న రోడ్డులో తనొక్కడే యిటూ అటూ తిరిగేడు రోడ్డు మీదనించి వెళుతూండేవాళు కుర్చీలతో ఉన్న టెంటులో వొంటరిగా ఉన్న తన్ను తన డిస్పెన్సరీని వొక నిముషం ఆగి చూసి వెళ్ళిపోసాగేరు

అందుకే గదిలోకి వచ్చి కూర్చున్నాడు. ఫంక్షన్ బాగానే జరిగింది రేపటినించీ ప్రాక్టీసు ఎలా ఉంటుందో? వచ్చినవాళ్లంతా అభిమానంతో మాట్లాడేరు తనంటే ఇష్టపడ్డట్టు కూడా కనిపించేరు వీళ్ళ సపోర్టు తనకు బాగానే ఉంటుంది

వాచీ చూసుకున్నాడు, తొమ్మిదిన్నర అయింది యీ టెంటువాడు వచ్చి కుర్చీలూ, టెంటూ తీసుకుపోతే బాగుండును. అందరూ వెళిపోయేక తనూ మూసేసి వెళిపోవచ్చు ఈ రోజు వొక్క పేషంటు వచ్చి ఉంటె తను చాలా సంతోషపడిపోయే వాడు కాని యీ టెంటూ, హడావిడీ, చూసి 'యీరోజు డాక్టరు పేషంట్సను చూడడు, అని అనుకొని ఉండొచ్చు లేకపోతే యిన్ని యిళ్ళు ఉన్న వీధిలో వొక్క జ్వరం వాడయినా లేకపోవడం ఏంటి?, ఆ నరహరి అన్నట్టు యీ వీధిలోని పేషంటుకు ప్రక్క వీధిలోకి వెళడం కష్టం బాధే! వెళ్ళి అక్కడ లైనులో రెండు గంటలు కూర్చోవాలి ఆ నరహరే కాదు, ఇంకో యిద్దరు కూడా అన్నారు అతని దగ్గర ఛార్జీలు కూడా ఎక్కువట మొదట్లో వొక్క రోజులో తగ్గించేవాడట! యిప్పుడు అయిదు రోజుల దాకా లాగుతున్నాడట! ఈ వీధిలో వాళ్ళంతా అతనంటే విసిగి పోయేరట, అయినా గతిలేక వెళ్తున్నారట. చాలా అసంతృప్తిగా మాట్లాడేరు యీ వీధివాళ్ళు అతని గురించి.

ఈ పాటికి అతనికి తెలిసిపోయి ఉంటుంది తను కీ నిక్ పెట్టినట్టు కొంచెం వర్రీ అవుతూండొచ్చేమో ?

'సార్' అంటూ పిలిచేడు. మాసిన గుడ్డల్లో చింపి చొక్కాలో కూలివాడులా ఉన్నాడు. క్రొత్తగా డిస్పెన్సరీ పెట్టేరని చూపించుకొనేందుకు వచ్చేడేమో! ఎవరూ రారనుకుని నిరాశగా ఉన్న సమయంలో వచ్చేడు తన ప్రయివేట్ ప్రాక్టీసులో మొదటి పేషంట్ క్రొత్త డిస్పెన్సరీలో మొదటి అర్జన అనుకుంటూ మనస్సు ఉల్లాసంగా అవుతూంటె 'ఏంకావాలి ?' అన్నాడు కుర్చీలోంచి లేస్తూ.

వాడు టెంటు వైపూ కుర్చీల వైపూ చూపేడు.

నా ప్రయివేటు ప్రాక్టీసులో మొదటి పేషంట్.... స్వాగతం... సుస్వాగతం... లాలాలా ల్లల్లల్లా.... రావోయ్ రారారా!




ఓర్నాయనోయ్... నే పేషంటుని కాను ఇక్కడి సామాన్లు పట్టుకు పోటానికి రిక్షా తెచ్చా అంటే వినిపించుకోడేంటి దేవుడో....

'వో అవా! ఈరోజే నేను క్రొత్తగా డిస్పెన్సరీ పెట్టేనట. అందుకే అవన్నీ అక్కడ ఉన్నాయి' అని 'చెప్పు' అన్నట్టు ప్రశ్నార్థకంగా చూసేడు.

'వాటిని తీసుకుపోడానికి రిక్షా తీసు కొచ్చేను సార్' అన్నాడు.

వీడు పేషంటు కాడు. కొంచెం నిరుత్సాహం చోటు చేసుకుంది. ఆ నిరుత్సాహాన్ని 'బ్రతికించేవు! ఇంకా రాలేదేంటి? అని నీ గురించే ఆలోచిస్తున్నాను' అన్నాడు మాటల్లో కప్పిపెడుతూ

వాడు మొలలోంచి నలిగిపోయిన కాగితాన్ని తీసి అందిస్తూ 'యిందండి సార్' అన్నాడు. తను అందుకోకుండా 'ఏంటి?' అన్నాడు.

'బిల్ సార్, మా సారు పంపించేరు. యీ సామాన్లతో బాటు డబ్బు కూడా తెమ్మన్నారు సార్.'

విరసంగా బిల్ అందుకొని యిరవై రూపాయల అంకె చూసి వీళ్ళ వనె బాగుంది. మూడు గంటలు అద్దెకు యిచ్చేందుకు యిరవై రూపాయలు! చొక్కా జేబులోంచి డబ్బు తీసి లెక్కపెట్టేడు పద్దెనిమిది రూపాయలు ఉన్నాయి. చిల్లర ఎంత ఉందో అనుకుంటూ పాంటు ప్రక్క జేబులోంచి పది పైసలూ, అయిదు పైసలూ తీసి లెక్కబెట్టేడు బిల్లు పోను బస్సు చార్జి యిరవై పైసలు మిగిలింది!

ఆ యిరవై పైసలు జేబులో వేసుకుంటూ మిగిలింది 'యింద' అంటూ యిచ్చేడు. వాడు చేతికిందా చిల్లర అందుకుంటూ 'సార్ యీ చిల్లర పోసుకోడానికి జేబు లేదుసార్! నాకు వాక కాయితం యిస్తే పొట్లాం కట్టుకుని మొలలో దోపుకుంటాము' అన్నాడు

వాడు పొట్లాం కట్టి మొలలో దోపుకుంటూ టేబిల్ మీద ఉన్న టీ కప్పులను చూస్తూ 'సార్ టీ కొంచెం పోయరా' అన్నాడు

కెటిల్ దగ్గరకు వెళ్ళి చూసేడు. వాక్కుఫ్ల్యాస్క్ టీ ఉంది మొదటిరోజు — అందరూ తాగింతరువాత ఆఖర్న నోరు విడిచి అడిగిన వీడికి లేదు అని చెప్పలేక పోయాడు

'టీ అయిపోయింది నువ్వు హోటల్లో కొనుక్కుని తాగు' అంటూ జేబులోని ఆ యిరవై పైసలు యిచ్చేసేడు.

వాడు పెంటు పీకేసి, కుర్చీలు రిక్షాలో వేసుకుని వెళ్ళిపోయేడు.

వాడు వెళ్ళగానే కాళ్ళలో నిస్సత్తువ

# ప్రాక్టీసు పెట్టిచూడు

ఆవరించి నట్టయింది. కుర్చీలో కూర్చు న్నాడు.

తన ఆత్మ చెబుతూంది. 'ఈ రోజు ఒక్క కేసు వస్తే చాలు. అది శుభ సూచకం' అంటూ. ఎవరూ రారు వెళ్ళి పోదాం అన్న నిరాశ, లేదు యింకొంచెం సేపు కూర్చుంటే రావొచ్చేమో అన్న ఆశ మధ్య ఊగిసలాడుతూ వాచీ చూసేడు. తొమ్మిది అయింది.

వీధిలోంచి అప్పుడో రిక్షా అప్పుడో సైకిలు వెళుతున్నాయి నిముషానికి ఒకరో యిద్దరో తన డిస్పెన్సరీ ముందు నించి నడుస్తూ వెళుతున్నారు. ఆరుగంటలప్పుడు ఉన్న సందడి, చప్పుడూ చాలా మటుకు తగ్గిపోయేయి.

యిలా నడుస్తూన్న వీళ్ళలో వొక్కళ్ళు వచ్చి తనచేత మందులు రాయించుకుంటే చాలు. మొదటి రోజు ఖాళీగా పోలేదు అన్న తృప్తి అయినా మిగులుతుంది.

ఇంకో పదిహేను నిముషాల వ్యథతో కూర్చున్నాడు నీరసం ఆవహించిన మనస్సుతో 'యిక కూర్చొన్నా లాభం లేదు' అనుకుంటూ లేచి వొళ్ళు వొకసారి విరుచుకుని తన స్టెతస్కోప్ బ్యాగ్ అందుకున్నాడు వెళ్ళిపోదాం అనే ఉద్దేశంతో. అప్పుడే తన డిస్పెన్సరీ వేపు అరుగుల మెట్లు ఎక్కుతూ ఎవరో కనిపించేరు.

మొదట పేషంటు అనుకోనేందుకు భయపడ్డాడు బనీనూ లుంగీమీద వస్తూన్న అతని వెనుక వొక ఆరేళ్ళవాడు. తన్ను చూస్తూనే 'డాక్టరు బాబూ' అన్నాడు అతను.

'ఏం కావాలి?' అన్న ప్రశ్నకు 'చూడండి బాబూ ప్రొద్దున్నవగా పనికి వెళ్ళి యిప్పుడే వొచ్చేనండీ! అన్నం తిందామని కాళ్ళు కడుక్కుంటున్నాను. యీ వెధవ గోడకు ఒక వారగా ఉన్న సైకిలు పడేసుకున్నాడండీ. ఇలాటివెళ్ళు చేస్తే ఎలా చెప్పండీ! తిండి గడవడమే కష్టంగా ఉన్నప్పుడు వీళ్ళ పనులకి డాక్టరు ఫీజులు ఎక్కడ కట్టుకోగలం చెప్పండి?' అంటూ తన ఉక్రోషం అంతా డాక్టర్నమీద వెళ్ళగక్కు కుంటున్నాడు.

మొదటి రోజు ఎవరినేనా పరీక్షచేయాలి. అలానే జరుగుతూంది అన్న సంతోషంతో ఆ తండ్రి మాటలు పట్టించుకోకుండా, 'ఏది బాబూ ఇలా రా! యీ సగ్గు మీదకు ఎక్కు' అన్నాడు సౌమ్యమైన కంఠస్వరంతో ఆ కుర్రవాడిని చూస్తూ.

వాడు అప్పటిదాకా ఏ దిక్కు చూపుకో అన్న భ్రమలో తండ్రి వెనుక నిర్భయంగా వచ్చినవాడు. తను సగ్గులు మీదకు రమ్మనగానే వెనక్కి వెనక్కి వెళ్ళడం మొదలు పెట్టేడు బెదిరే ఆ కుర్రాడ్ని బెదరనీయకుండా తను తిరిగి 'భయపడకు రా' అంటూ మరీ మృదువుగా పిలిచాడు.

ఆ కుర్రవాడికి కొంచెం దూరంలో ఉన్న తండ్రి కుర్రవాడు సగ్గుల మీదకు రావటం లేదనే ఉక్రోషంతో శివం ఎత్తిన వాడిలా 'రా వెధవా, వెధవపని చేసిందే కాకుండా యింకా వెటకారం చూపిస్తున్నావా' అని 'డాక్టరూ! వీడికి మాటలు అర్థం కావండీ!' అంటూ రెండు తగలనిచ్చేడు

అసలికే సైకిలు పడేసుకుని దెబ్బలతో ఉన్న కుర్రాడికి మీదనించి తాపులా! చిర్రెత్తుకొచ్చింది తనకు. 'మీరు ఊరుకోండి' అంటూ ఏడ్చే కుర్రవాడ్ని సగ్గులు మీదకు ఎక్కిస్తూ కాలూ చెయ్యీ చూసేడు. కొంచెం గీసుకుపోయింది- మోకాలిచిప్పమీద. పరీక్షగా చూస్తూండే తనతో 'చిన్నదెబ్బే డాక్టర్, కొంచెం అయిడిన్ వెయ్యండి సరిపోతుంది' అన్నాడు కుర్రాడి తండ్రి.

'అలానే వేస్తాను. అయినా రక్తం బయటికి వొచ్చింది, సెప్టిక్ కాకుండా ఒక యింజక్షను యిస్తే...'

'యింజక్షనూ, మాత్రలూ యివన్నీ డబ్బు గలవాళ్ళకండీ, మాకు యింత అయొడినే చాలు, అది నాదగ్గర అయిపోయిందని వచ్చేను' అన్నాడు అతను తను వొచ్చినందుకు సంజాయిషీగా.

'సరే అలానే కానివ్వండి' అంటూ అయొడిన్ అద్దేడు. 'థాంక్స్ డాక్టర్' అంటూ అతను యింకా అక్కడే నిలబడితే తను ఎక్కడ యింజక్షను యిచ్చేసి డబ్బు లాక్కుంటాడో అన్న భయం తెచ్చిన పరుగు లాంటి నడకతో వెళ్ళిపోయేడు.

ఎవరో ఒకరు, దేనికో దానికి- పేషంటు అంటూ మొదటిరోజు వొచ్చేరు. యిక క్లినిక్ తృప్తిగా మూసెయ్యొచ్చు అనుకుంటూ

గొప్ప జతగా

భారతదేశపు ఏకైక దుర్గంధనాశక
సబ్బు మరియు టాల్క్

దుర్గంధంనుండి రెండురకాలుగా రక్షణకు
సరైన జోడీ...సింథాల్ సబ్బుతో
స్నానం, ఆపైన సింథాల్
టాల్కు చల్లుకోవడం ..మీరు ఎంతో,
మరెంతో తాజాదనంతో హాయిగా
మురిసిపోయేందుకు.

గోద్రెజ్ వారి
సింథాల్







Interpub/CTS/1/79/TL

తను రెండు మైళ్ళు నడిచిపోవాలని మరచిపోయి ఆనందంతో తలుపులు మూయ బోగాడు.

*　　*　　*

చల్లగాలి వీస్తూంటే గంటసేపు నడిచి యిల్లు చేరుకొనేటప్పటికి పదిన్నర అయింది. తన యిల్లు ఊరికి రెండు మైళ్ళదూరంలో ఉంది. పదిహేనేళ్ళ క్రిందట తన తండ్రి అక్కడ యిల్లు కట్టించి నప్పుడు చుట్టు ప్రక్కల అంతా ఖాళీప్రదేశమే.

తన తండ్రి పరిచయస్థులు, "ఏంటి రంగనాథం, యీ అడవిలో యిల్లు కట్టు కున్నావేంటి ?" అంటూ అడిగితే ఆయన చిరునవ్వుతో 'చూస్తూండండి. వొకరోజు యిది కూడా పట్నంలో భాగం కాక మానదు' అనేవారు.

తన తండ్రి గవర్నమెంటు ఆఫీసులో సెక్షన్ హెడ్. అతను ఆఫీసులో చాలా పొందికగా మాట్లాడి- అనవసర వ్యవహారాల్లో తల దూర్చకుండా మిత భాషి అన్న పేరు తెచ్చుకున్నాడు.

తమ యిల్లుతో బాటు బావి కూడా త్రవ్వించేరు. ఆ నీళ్ళు తియ్యగా త్రాగేందుకు చాలా బావుంటాయి. ఆ చుట్టు ప్రక్కల నెక్కడా యిల్లు లేకపోవడం వలన, అటు ప్రక్కగా వెళ్ళేవాళ్ళకి నెప్పుడైనా నీళ్ళు అవసరం అయితే తమ యింటికే వచ్చేవారు.

అమావాస్య రాత్రుల్లో దట్టమయిన అంధకారంలో తమ యింట్లో హరికెన్ దీపం 'యిక్కడ ఆశ్రయం ఉంది' అంటూ చుట్టుప్రక్కలకు సంకేతాలు ప్రసరించేది. ఆ దీపం చూసి నెవరేనా అర్ధరాత్రిళ్ళు ఆశ్రయానికంటూ వస్తే రంగనాధంగారు నిర్భయంగా తలుపు తీసి తమకు ఉన్నది యింత పెట్టి, వాళ్ళకు పడుక్కోనేందుకు వసతి కల్పించేవారు.

తము ఏ అత్యాచారాలకీ గురికాకపోవడం మిగతావాళ్ళకు ధైర్యం కల్గించింది. ఆ ధైర్యంతోనే వొకటి తర్వాత మరొక యిల్లు పడి, యిప్పుడు అక్కడో పెద్ద కాలనీయే వెలసింది. ఆ కాలనీకి సిమెంటు రోడ్డు గురించి విన్నపాలు కేసన్ను పెట్టుకున్నా ఏం లాభం లేకపోయింది. వింతో కష్టంమీద ఎలక్ట్రిసిటీ మాత్రం తెప్పించుకోగలిగేరు. ఇకనీళ్ళ గురించి చెప్పే అక్కర లేదు.







రాగతి
పండరి

# ప్రాక్టీసు పెట్టిచూడు

ఇంకా వొక నాలుగేళ్ళదాకా అక్కడ పైపు లైను పడే సూచనలే లేవు. అందుకే ఆ కాలనీ యిళ్ళన్నీ నీళ్ళకు బావులమీదే ఆధార పడ్డాయి.

తను యింటికి వెళ్ళేటప్పటికి ప్రక్క నున్న శివయ్య అవతలి వాటాలో ఉన్న వెంకట్రామయ్య యింటిముందు నిలబడి గట్టిగా నలుగురూ వినేటట్టు మాట్లాడు తున్నాడు.

శివయ్య తమ యింటి ప్రక్క పదేళ్ళ క్రిందటే యిల్లు కట్టుకున్నా బావి త్రవ్వించుకోనందువల్ల తమ బావి నీళ్ళే వాడుకొనే వాడు.

వెంకట్రామయ్య, కట్టిన యిల్లే రెండేళ్ళ క్రిందట కొనుక్కుని, తనకు కావలసిన కనీస అవసరాలు అమర్చుకున్నాడు. వెంకట్రామయ్య కంటే ఆ యింట్లో ముందుండేవాళ్ళు పగలు కొండల్నీ, రాత్రిళ్ళు అరుబయల్నీ మరుగుదొడ్డి క్రింద వాడు కొనేవారు. వెంకట్రామయ్య చాలాపట్టింపు మనిషి. అతను ఇల్లు కొనగానే కాంపౌండులో వొకమూల మరుగుదొడ్డిని నిర్మించు కున్నాడు.

శివయ్య మహా కూడిక మనిషి. అతను గవర్నమెంటు ఉద్యోగంలోంచి రిటైరైన తర్వాత, ఆ కాలనీలో రేషన్‌షాపు నడిపిస్తూ బాగా సంపాదించేసేడు. ఆ సంపాదనతో మేడ మీద వొక నాలుగు గదుల్ని మొన్నే వేసి తొందరలో అద్దెకు యిద్దాం అనుకున్నాడు. అతను అలా అనుకుంటూంటే అతని సలహాదారు వొకరు 'నీవు మేడను అద్దెకు ఇద్దాం అనుకుంటున్నావు బాగానేవుంది. కాని అద్దెకున్నవాళ్ళు మిద్దె దిగి ప్రక్కింటికెళ్లి వాళని బతిమాలి రోజూ నీళ్ళు తోడి మిద్దె మీదకు తీసికెళ్ళడం అన్నది చాల యిబ్బంది. ఆలోచించు' అన్నారు.

శివయ్య ఆలోచించగా అతనికి అనిపించింది తన యింట్లో వొక బావి త్రవ్వి ఆ బావికి వొక పంపు అంటూ పెడితే అద్దెకున్న వాళ్ళకు అసలు తోడుకోవలసిన అవసరమే ఉండదు. యీ సౌకర్యానికి కాస్త హెచ్చుగా అద్దె తీసుకోవచ్చు అనుకుని కూలీల్ని పిలిపించి బావి త్రవ్వించేడు అతను బావి త్రవ్వేముందు తను హెచ్చరించేడు- 'శివయ్యా! ఏ యింజనీరు సలహా అయినా తీసుకో!' అంటూ. 'దీనికి యింజనీరు సలహా వెందుకు?' అంటూ కొట్టిపారేసేడు శివయ్య.

'కక్కుర్తి పనులు చేస్తావు నివ్వడో బాగా దెబ్బతింటావు' అనేవ ఆ విషయాన్నే మరిచిపోయేడు తను. ఇప్పుడు శివయ్య విధానం చూస్తుంటే అతను వస్తుపోయి నట్టే కనిపిస్తున్నాడు. ఆ బావి విషయంలోనే ఏదో బెడిసి కొట్టి వుంటుంది అనుకుని.

తను యింట్లోకి వెళ్ళబోతూ, పెద్ద గొంతుకతో అటూ యిటూ చిందులు లాంటి వడకలో ఉన్న శివయ్యతో 'ఏమయిందని?' అన్నాడు.

"డాక్టరూ! మునిగిపోయేను. ఎవ్వరూ తిన్నట్టు కాలేదు రెండువేలూ" అంటూ శోకాలు పెట్టసాగేడు.

'ఏంటి శివయ్యా! ఏదో అలా ఏడుస్తావు?'

'డబ్బు పోయిందన్నావు ఏదైనా యింకేం చేస్తాను. చిన్నగారి మొన్న బావిలో నాగా నీళ్ళు పడ్డాయని మురిసిపోయేను. ఇప్పుడు ఆ నీళ్ళు అశుద్ధం కంపు కొడుతున్నాయండి.'

'ఎందుకంటి?' అన్నాడు తను.

'నేను తవ్వించిన బావి అవతలే వెంకట్రామయ్య సెప్టిక్ ట్యాంక్ ఉందండి. అందులోంచి అశుద్ధం నీళ్ళు నా బావిలో ఊరుతున్నాయండి'

'అయితే ఇప్పుడేం చెయ్యాలంటావు?'

'మీరంతా బాగా చదువుకున్న పెద్దమనుష్యులు నా బావి కంపు కొడుతూంటే చూస్తూ ఊరుకుంటారా, అతనితో చెప్పి అతని దొడ్డిని జరిపించమనండి! దొడ్డి జరపేదాకా బావి నీళ్ళు కంపుకొడతాయని యింజనీరు చెప్పాడు.'

తనకు చుర్రున కోపం వచ్చింది. 'ఏం శివయ్యా! బుద్ధి ఉండే మాట్లాడుతున్నావా? ఆలోచించుకోకుండా నువ్వు తప్పు చెయ్యడం. దానికి వెంకట్రామయ్యగారు డబ్బు ఖర్చు పెట్టడమా. ఎవరేనా వింటే నవ్విపోతారు. నీ బావి బాగుపడాలంటే అవసరమైతే ప్రతిమాయిలోని ఆయన సొంతఖర్చులతోనే ఆయన దొడ్డి జరిపించు' అని 'యివన్నీ పగటి పూట ఇంట్లో మాట్లాడుకోవే విషయాలు. ఇలా రోడ్డుమీద మాట్లాడేవి కావు. అందరూ వింతగా చూస్తున్నారు. యింట్లోకి వెళ్ళు' అంటూ శివయ్యని యింట్లోకి పంపించి వెంకట్రామయ్యగారితో 'శివయ్య తీరే అంతండి. రేపు మీ యింటికి వచ్చి మాట్లాడుతాడు', అని తను లోనికి వెళ్ళిపోయేటప్పటికి యింట్లో అందరూ తన గురించే ఎదురు చూస్తున్నారు.

ఇంట్లో మొదటినించీ అందరూ కలిసే తింటారు. తను కాలేజీలో చేరిన తరువాత– మధ్యాహ్నం కలిసి తినే యీ అలవాటు తప్పింది. రాత్రి మాత్రం తప్పనిసరిగ అందరూ వొకేసారి కూర్చోడం వొకేసారి లేవడం జరగాల్సిందే! అన్నానికి కూర్చునే ముందు ప్రతివాళ్ళూ–వాళ వాళ్ళ కంచం, వాళ వాళ్ళ గ్లాసు వాళ్ళు అమర్చుకోవలసిందే! భోజనం అయిన తరువాత ఎవరి కంచం గ్లాసు వాళ్ళు తీసి కడుక్కొని దాచుకోవలసిందే!

అందరూ తన్ను చూస్తూనే 'అమ్మయ్య' అంటూ పెద్ద నిట్టూర్పు విడిచి కంచాల్ని శబ్దం చేసేరు అది యిక అన్నం పెట్టొచ్చు అన్నదానికి సౌంజ్ఞ.

ఇంట్లో అందరి కంటే రెండో చెల్లెలు రాధకే తన దగ్గర చాలా చనువు. అందుకే తన్ను చూస్తూనే 'అన్నాయ్ ప్రాక్టీసు మొదటి రోజునించీ బంపరుగా ఉందేంటి? యింత ఆలస్యంగ వొచ్చేవు. ఏంటేంటి ఈ రోజు కలెక్షను?' అంది నవ్వుతూ. తన పెద్ద చెల్లెలు సీత 'చిన్నదానివి! నీ కెందుకే ఆ పెద్ద సంగతులు. వొయ్యా మొసుకు నీ అందరి గ్లాసుల్లో నీళ్ళు పోయి' అంది.

'డబ్బు గురించి అర్థంకానంత చిన్నదాన్ని కాదులే!' అంటూ విసుక్కుంటూ లేచింది రాధ.

సీత అందరి కంచాల్లో అన్నం వొడ్డించింది.

తల్లి కూరా పచ్చడీ వొడ్డన చేసింది.

తండ్రి 'యిక మొదలు పెట్టండి' అన

## జనం నోట్లో

— డా. సి. నారాయణరెడ్డి.

పలుకుతున్నాను నేను
కలం గొంతుక మంచి
కాలంలా పరుచుకున్న
కాగితం గుండెమీద.

ముద్దుగా ఇంకిన ముక్కలు
మొనదేలిన అక్కరాలై
చిరిగిపోయాయి కాగితాన్ని
చిడమ కాలితో తన్నేసి.

ఏవీ ఆ అక్షరాలు ?
ఏదీ నా ఆనవాలు ?
అవి పదిలంగా పలుగుతున్నాయి
అరిగిపోని జనం నోట్లో.

గానే అందరూ అన్నంలో కూర కలపడం మొదలు పెట్టేరు.

ముద్ద నోటిలో పెట్టుకుంటూన్న తరువాత, 'నారేయ్ సుదర్శనం' అంటూ తండ్రి అతని స్వంత అధికార ధోరణిలో 'ఎలా ఉందేంటి? ప్రాక్టీసు' అన్నాడు.

'మొదటిరోజు కదా! అప్పుడే ఏలా తెలుస్తుంది?'

'వాతావరణం మనకు అనుకూలంగా ఉంటుందో లేదో కూడా తెలియదేంటి?' అంటూ ప్రశ్నించేడు.

'అనుకూలంగా ఉండొచ్చు. ఎందుకంటే ఆ ప్రక్కవీధి డాక్టరుతో అందరూ విసిగెత్తిపోయేరు.'

'ఆ డాక్టరు డిగ్రీ ఏంటి?'

'ఏదో పాత డిగ్రీ అని విన్నాను.'

'ప్రాక్టీసు ఎలా ఉందేంటి? అతనిది.'

'మనుషుల్ని దోచేస్తున్నాడట.'

'అయితే యిన్నాళ్ళూ అతనికి పోటీ అంటూ ఎవరూ లేరు కాబట్టి బాగానే జరిగింది. ఇప్పుడు నువ్వు వొచ్చేవుగా! ఎలాగయినా అతనికి భయం పట్టుకొనే ఉంటుంది.'

అతనేం మాట్లాడలేదు.

'నీవు అతనికంటే ధరలు కొంచెం తక్కువగానే తీసుకో. వచ్చిన వాళ్ళను సంతృప్తి పరచేందుకే ప్రయత్నించు. నాకు తెలిసిన ఒక డాక్టరు ఉండేవాడులే.

## ప్రాక్టీసు పెట్టేవాడు

మొదటినించీ అతనికి ఖర్చులు ఎక్కువ. రెండుసార్లు ప్రాక్టీసు అంటూ పెట్టి జరగక ఎత్తేసేడు. ఎందుకో తెలుసా?' అంటూ తన్ను ప్రశ్నార్థకంగా చూసేడు.

తను తల తిప్పేడు తనకు తెలియదన్నట్టు.

'నీవు తెలుసుకోవాలి. అందుకే చెబుతున్నాను' అన్న ధోరణిలో—'అతనికి దాహం ఎక్కువ, అతని దాహం ఎవరూ తీర్చలేక పోయేరు!' అంటూ తన్ను అర్థం అయిందా అన్న చూపులో చూసి, కొంచెం కష్టంలే యిలా మాట్లాడితే అర్థంచేసుకోవడం అన్న చిరునవ్వుతో— 'అతనికి మనిషి కనపడ్డేచాలు యింజక్షను పొడుస్తాను అన్న ధోరణిలో ఉండేవాడు. . కాస్త వడిసెం చేసినా, నువ్వు ఒక కోర్సు యింజక్షను తీసుకోవాలి అనేవాడు జీలకర్ర కషాయం తాగేవాళ్ళకు- కాస్త పడిసేనికి పదిహేను రూపాయలు బిల్లు చేస్తే యిక ఎవరు వొస్తారంటావు? అతడి గడప ఎక్కిన ప్రతీ వాడూ జేబులన్నీ శుభ్రంగా దులిపి వెళ్ళాల్సిందే! అందుకే అతను జీవితంలో చాలా దెబ్బ తిన్నాడు. అతని అసమర్థతను మొదట గ్రహించిన అతని భార్య ప్రయివేట్ గా పరీక్షలు కట్టి బి. ఇడి, అయి టీచరు

## సౌరశక్తి స్నానాల గదులు

ప్రస్తుతం జపానులో వేడి నీటి స్నానానికి సౌరశక్తిని ఎక్కువగా వుపయోగిస్తున్నారు. పెట్రోలు ఖరీదు అతిగా పెరిగిపోయినందువలన, పబ్లిక్ బాత్ హౌసెస్‌లో వేడి నీటి స్నానం రాను రాను దుర్లభమౌతున్నది. పైగా యీ మధ్య వీటికి పెట్రోలు సరఫరాను 30 శాతం తగ్గించారు ధర మాత్రం 80 శాతం పెరిగింది సాధారణంగా వీటిలో రోజూ 200లీటర్ల పెట్రోలును ఉపయోగిస్తారు. నీళ్ళను వేడి చేయడానికి సౌరశక్తిని వుపయోగించడం వలన పెట్రోలును పొదుపు చేయడమే కాక, అతి చౌకగా ప్రజావసరాలను తీర్చగలుగుతున్నారు.

[illegible] రం గడిచేది. నువ్వుకూడా ప్రతీ వాళ్ళకూ యింజక్షను అంటూ మొదలు పెట్టకు. వాళ్ళ గురించే నీవు ఉన్నట్టు, వాళ్ళ డబ్బు గురించి కాదన్నట్టు ప్రవర్తించు అప్పుడు జనం నీ గురించి లైనులో అలా పడిగాపులు కాస్తుంటారు!'

ఇంతలో గుమ్మంముందు ఎవరో దగ్గిన అలికిడి అయింది. 'ఎవరూ?' అన్నాడు తండ్రి.

"నేనండీ శివయ్యని. ఒక రెండు బిందెలు నీళ్ళు తోడుకుంటాం" అని వచ్చేను.

'రా శివయ్యా, ఎప్పటినించేంటి మురుగు దొడ్డి జరిపించడం మొదలు పెడ్తావు?'

'కొంచెం చేతిలో డబ్బు చూసుకుని...'

'ఎంత డబ్బు చేసుకున్నా ఆ పీనాసి మాటలు వొదిలేవు కావు శివయ్యా!' అని తండ్రి అంటే 'అదికాదు బాబుగారూ! ఇప్పుడే రెండువేలు బావిమీద పెట్టేను. మళ్ళీ నా స్వంత డబ్బుతో దొడ్డి జరిపించి యీ కుళ్ళు కంపునీళ్ళు తీయించి, బావి కడిగించి, అందులో రింగులు వేయించి— చాలా ఖర్చు అయిపోతుంది.'

'అలా అని యీ మురుగుదొడ్డి జరిపించే ఖర్చు వెధ్వాల మీద నించి లాగేయాలని కొట్లో ధరలు ఎక్కించేసేవు, కాలనీ వాళ్ళంతా యిబ్బంది పడిపోతారు!' అన్నాడు.

'అలా ఎందుకు చేస్తాను' అంటూ 'నా భార్య దొడ్లో కూర్చుంది, దానికి నీళ్ళు అందిస్తే కాని అది బయటికి రాలేదు. నేను తొందరగా రెండు బకీట్లు తీసుకొని...'

'నోరిని అమ్మకడుపు కాలా! పెళ్ళాన్ని దొడ్లో ఉంచి యిలా బాతాఖానీకి కూర్చున్నావేంటి? వెళ్ళు వెళ్ళు. ఆమె గాని వచ్చి నోరు విప్పిందా కాలనీకి రాత్రంతా నిదురే ఉండదు' అంటూ తరిమేడు తండ్రి.

భోజనం అయింతర్వాత తన గదిలోకి వెళ్ళి 'విమలా'! అలా వాకింగ్‌కి వెళ్ళివస్తా' అంటూ బయలుదేరేడు.

తను రోజూ భోజనం కాగానే అలా బయటికెళ్ళి ఒక సిగిరెట్టు కాల్చివస్తాడు. ఇంట్లో-సిగరెట్ కాల్చేందుకు అని చెప్పలేను కాబట్టి వాకింగ్ అంటాడు తన భార్యకు అది సిగరెట్ గురించే అని తెలుసు.

(ఇంకా వుంది.)

# ఛాంపియన్ డిటర్జంట్ కేక్ !

# 1అప్

మరింత
తెల్లదనంతో
మీకు
విజయం!



అధిక తీవ్రంగా పని చేసే నురుగ, అధికంగా తెలుపుచేసే పదార్థాలతో శక్తి. దాంతోపాటే శుభ్రతతో పాటు తెల్లదనాన్ని యిస్తుంది మీకు వన్-అప్. దాంతో తెల్లవాటికి మరింత తెలుపు. రంగువాటికి మరింత మెరుపూ వస్తుంది.




మీకు
డబ్బులో
మరింత
ఆదా!



వన్-అప్, మరే యితర డిటర్జంట్ కేక్ కన్నా ఎక్కువకాలం మన్నుతుంది. ఎందుకంటే, వాడగానే తొందరగా అరిగిపోదు గనక. అంటే ఉతికే ప్రతిసారీ మీరు డబ్బును ఆదా చేస్తున్నారన్నమాటే!




తెల్లదనానికి మీ పాలిట ఛాంపియన్!

ASP/WL-1UP 2R

విట్కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.




## ఆయువుంటే...!

టోక్యోలో ఓ నిండు గర్భిణి పరిగెత్తే రైల్లో బాత్‌రూముకు వెళితే ఆమె గర్భస్థ శిశువు బట్టనజారి ఆ కన్నంలోంచి క్రిందపడిపోయిందట. పోలీసు లాస్టలాన్ని కనుగొని, శిశువును చేరుకొనేలోగా ఆ శిశువుమీదుగా ఏడు రైళ్లు పోయాయట. అయినా ఆ శిశువు విక్షేపంగా, ఆరోగ్యంగా, క్షేమంగా ఉన్నదటా పట్టాల మధ్య. ఎటొచ్చీ తలకు చిన్న గాయం అయ్యిందట.

## వింతల్లేని వైద్యశాస్త్రం!

ఢిల్లీలోని ఓ ఆసుపత్రిలో ఓ గర్భిణి స్త్రీ నెలలు నిండకుండానే ఓ 800 గ్రాముల బరువున్న శిశువునుకంటే ఆ శిశువు మరణించిందని ఆసుపత్రి వారు ప్రకటించారట. ఆ శిశువు నాయనమ్మ కనీసం మృత శిశువునైనా చూడాలన్న కోరికతో ఆసుపత్రికి వెళ్లి ఆ మృత శిశువు ఏది అనడిగితే, తెల్లగుడ్డలో చుట్టిన ఓ బంగీలాటిదాన్నామెకు యిచ్చారటాసుపత్రి వారు. బంగీయిప్పి చూస్తే లోపల పసికందు చిన్నగా ఏడుస్తూ కళ్లు తెరిచి చూడ్డానికి ప్రయత్నిస్తోందట. ఆసుపత్రిలో యింత నిర్లక్ష్యమా. బ్రతికున్న శిశువును చచ్చినట్టు లెక్కగట్టి లంగచుట్టి పారేస్తారా అని ఆమె ఆసుపత్రి అధికారులను ప్రశ్నిస్తే ఆశ్చర్యం నుంచి కోలుకున్నవారు వైద్యశాస్త్రంలో వింతలు పెద్దవింతేం కాదన్నారట. ప్రాణమున్న శిశువుని ప్రాణం లేనిదిగా డిక్లేర్ చేయడం అక్కడసామాన్యమనా వారిభావం! ఏమో!

## హత్యకి దారితీసిన రహస్య ప్రేమాయణం

తిరుచెంగోడుకు సమీపంలో ఉన్న ముండాచ్చి అనే వూరిలో 40 ఏళ్ల చిత్రన్ భార్యకు, చిత్రన్ తమ్ముడు చెంగోడనుకూ రహస్య ప్రేమాయణం ఉన్నట్టు కనిపెట్టిన, చిత్రన్ తన తమ్ముణ్ణి చీవాట్లు వేశాడట. దాంతో అతను వూరొదిలిపెట్టి



కొన్నాళ్లు ఎక్కడెక్కడో తిరిగి, చివరికి మళ్లీవూరు చేరేసరికి చిత్రన్‌కు కోపంవచ్చి శనిలా మళ్లీ దాపురించావురా నా ప్రాణానికి. నా కుటుంబం సర్వనాశనం చేస్తేగాని వదలవా ఏం? అని అరుస్తూ పక్కనే ఉన్న గడ్డపారతో అతని తలమీద ఒక్క పెట్టు పెట్టాడట. దాంతో అతనితల చితికి, విలవిలా తన్నుకుని అతడు చనిపోయాడట.

## పొట్ట తిప్పలు!

చిప్పి ఒట్స్ అనే హోలీ వుడ్ హాస్యనటుడు ఒహోయన తన పొట్టను 75 వేల డాలర్లకు ఇన్సూర్ చేశారట. 196 పౌనుల బరువునుంచి 134 పౌనుల బరువుకు దాను తగ్గితే (అంతకన్నా తగ్గినా కూడా) ఇన్సూరెన్సు కంపెనీ వారు తనకా డబ్బు యిచ్చేలాగ ఇన్సూరు చేసుకున్నాడటాయన. ఇదేమిటంటే నా పొట్టే నా జీవనాధారమన్నాడటా ఆంగ్లేయుడు!

## గుడ్లగూబ గొప్పతనం!

గుడ్లగూబ లేనిదేశం ప్రపంచంలో లేదట. ఏ వాతావరణంలోనైనాసరే; శీతల ప్రదేశాలలోనయినా, వేడి ప్రదేశాలలోనయినా ఇది బ్రతుకుతుందట. మిగతా ఏ పక్షులకూ లేని యీ గుడ్లగూబ అవయవ నిర్మాణమూ, దాని శరీర స్థితి ఎంత గొప్పదో అని విజ్ఞానులు ఆశ్చర్యపోతున్నారట. వేడిదేశాలలో స్నానంచేస్తూ, శీతల దేశాలలో దుప్పట్లతో నూ మనిషి సతమతమవుతుంటే యీ గుడ్లగూబ ఎంచక్కా ఆ ప్రదేశాలలో మనగలుగుతున్నదట.

## సినిమా వ్యామోహం!

ఆత్తూరులోని ఓ స్కూలులో పదో తరగతి చదువుకునే 15 ఏళ్ల మణిమేలి కన్ను చెదిరే అంత అందంగా వుంటుందట. ఇంత అందమున్నదానివి నువ్వు సినిమాలలో నటిస్తే ఎంత రాణిస్తావో తెలుసా అని తోటి విద్యార్థి విద్యార్థినులు రోజూ అంటూ వుండేసరికి ఆమె తను బ్యాంకులో దాచుకున్న 85 రూపాయలు తీసుకుని వేరుగా దాచుంచి, ఓ ఆటో సిటీ జారతి రాజా అనే డ్రైవర్‌కు ఇంటికి తీసుకుపొమ్మందట. ఆటో డ్రయివరు దేవరాజన్‌కు సందేహం వచ్చి ఆటో వేగంగా తన మామగారింటికి పట్టించాడట. అతని మామగారు ఆమె వివరాలడిగి డ్రైవర్‌కు చెప్తూ నాగమన్నాడట ఈలోగా ఆత్తూరులోని ఆమె తల్లిదండ్రులు పోలీసు రిపోర్టివ్వడంతో ఆ పోలీసులు ఈ దాసు పోలీసులను విచారించడంతో ఆమె ఆచూకీ తెలిసి ఎక్కువ ఆత్తూరుకు తెచ్చి ఆమె నామె తల్లిదండ్రులకు అప్పగించారట.

## ఊరి పేరడిగితే ఉలుకెందుకు?!

డెన్మార్క్‌లోని ఓ నగరంలోని ఒక బ్యాంకుకు ఓ ఆయన వచ్చి కొన్ని నోట్లనిచ్చి చిల్లర అడిగాడట. బ్యాంకు క్యాషియరు పని చేస్తున్న అమ్మాయి చిల్లర ఏ విధంగా ఇవ్వాలి అని అడిగి, యథాలాపంగా మీది ఏవూరు? అని అడిగిందట. దాంతో, ఆ వ్యక్తికి కోపం వచ్చి నన్ను ఏ వూరని అడుగుతావా అని అరిచి, వచ్చినకన్నా వేగంగా వెళ్లిపోయాడట. అతను వదిలివేసిన డబ్బు ఇంకా ఆ బ్యాంకులో ఎక్కవుంటు లేకుండా ఉందట. ఈతడెవ్వడని డిటెక్టివులు కూడా కనుక్కోలేక పోయారట. ఎప్పటికైనా తిరిగివస్తాడేమోనన్న ఆశ బ్యాంకువారికి వున్నగిల్లిందట.

## ఫోటోగ్రఫర్ని భయపెట్టిన బాలామణి!

సేలంలో చేబి అనే ఓ ఇరవయ్యేళ్ళ బాలామణి చెంగున ఓ పోటోస్టూడియోలోకి అక్టోబరు 16న గంతేసుకుంటూవెళ్లి నేను బట్టలన్నీ విప్పుకుని నగ్నంగా నిలబడ్తాను. చక్కని పోటో ఒకటితియ్యండి అందట తియ్యగా. అంతలో ఆగక గమ్మున వోణివిప్పి పారేసి, పుట్టుపుట్టున జాకెట్టు బటను లాడదీసేలోగా స్టూడియో సొంతదారు మైకంలోంచి తేరుకుని, య్యావ్వే అనోకకవేసి పోలీసులను శరణుకోరాడట!

## కత్తిరింపులో రికార్డు!

చేతికి ఓ కత్తెర, బోలెడు కాగితాలూ యిచ్చి నిమిషం వచ్చినంతసేపు కాగితాలు కత్తిరించు అని టైం పెట్టుకు చూస్తే ఒక మనిషి ఎంతసేపు యీ పేపర్లు కత్తిరించగలడు అనే దాని మీద యుకోస్లవేకియాలో నో పందెం పెట్టారట. ఒక విద్యార్థి విసుగూ విరామం లేకుండా 14 గంటల 45 నిముషాలు అలా కాగితాలను కత్తిరించి, ప్రపంచ రికార్డును స్థాపించాడట. వినకేనోపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్!

(గత సంచిక తరువాయి)






























[ఇంకా ఉంది]



# ఇంకోసారి...!

వి. శాంతారామ్

రాత్రి ఎనిమిది గంటలయింది. లింక్ ఎక్స్‌ప్రెస్ అప్పుడే వెళ్ళిపోయింది. రోజూ రద్దీగానున్న ప్లాట్‌ఫారమ్ ఎందుకో ఆ రోజు డల్‌గా వుంది.

హత్య చేసినవాడిలా, నేరస్తుడిగా, హంతకుడిలా భయపడుతూ, విచారంతో చివరి ప్లాట్‌ఫారమ్‌లో నున్న, చివరి సిమ్మెంటుబల్లపై కూర్చున్నాడు మధు పైకెత్తిన కనురెప్ప, క్రిందకు పడకుండా తదేక దృష్టితో ఏదో చూస్తున్నాడు. ఈ లోకంతో సంబంధము లేనట్టు ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు

మధు బి యస్. సి. ఫైనల్ పరీక్షలు వ్రాసి ఫలితాలు కోసం ఎదురుచూస్తున్నాడు. తల్లి చేతికున్న రెండు బంగారు గాజులు అమ్మి, ఇంటర్‌మీడియట్‌లో జాయిను చేసాడు చెల్లెలు పద్మను. బి యస్ సి తో చదువును ముగించుకోవాలనుకున్నాడు తను ఎందుకంటే పెళ్ళి కాని చదువుచున్న చెల్లెలు, ముసలి తల్లి తనపైనే ఆధారపడివున్నారు కూర్చొని తినటానికి ఆస్తి, పాస్తులేమి తన తండ్రి వుంచలేదు వున్నవి కాస్త అమ్మేశాడు ఏదైనా ఆఫీసులో ఉద్యోగము సంపాదించాలంటే కనీసం ముఖ్యమంత్రి రికమెండేషన్ లేదా మనిషిని ఆకర్షించే యంత్రము (ధనము) వుండాలి అలాంటివేవి మధుని వరించ లేదు అవన్నీ మధుకి దూరంగానే వున్నాయి పైగా ''ఫార్‌వర్డ్ కాస్ట్''

''రేపే మన జాతకాలు'' తన స్నేహితుడు రమణ గొంతు వినిపించింది మధుకు

జాతకాలంటే నమ్మని మధు, ఎందుకో ఉలిక్కిపడ్డాడ

''ఏమిట్రా రమణ, జాతకాలేమిటి ?'' అడిగాడు మధు

''అదేన్రా, మన పరీక్ష ఫలితాలు రేపేనట '

''అంతేనా. వస్తే ఏమి, రాకపోతేనేమి ? ఫస్టుక్లాసులో పాస్‌య్యైనా ప్యూన్ పోస్టు ఐనా రాదు, మనది ఫార్‌వర్డు'' అన్నాడు మధు

సిగ్నల్ పడింది. తొమ్మిదిగంటల పాసింజర్‌కే కాబోలనుకున్నాడు మధు. ఇద్దరూ మెయిన్ రోడ్డు వైపు నడిచారు — అది వాళ్ల సాయంకాలం చర్య.

* * *

''అన్నయ్యా, ఫిజిక్స్ రికార్డు లేదని, ఈరోజు ప్రాక్టికల్ క్లాసుకి రానివ్వలేదు'' అని చెల్లెలు, ''రేపు శనివారము, గోధుమరవ్వ లేద''ని తల్లి.

ఇవన్నీ వినేసరికి మతి పోయినట్లనిపించింది మధుకు.

రేపు రికార్డు కొంటానని, ఏదోవిధంగా ఒప్పించాడు పద్మను.

ఆరోజు ఎందుకో భోజనం కూడా సరిగ్గా చేయలేదు. పడుకోవాలంటే నిద్రపట్టడంలేదు. చెల్లెలు మాట, తల్లి మాట చెవిని మారుమ్రోగుతున్నాయి.

* * *

మరునాడుదయం టౌనులోకి పోయాడు మధు. ఎందుకో ఆరోజు చాలామంది విద్యార్థులతోనే నిండివుందా టౌను కొందరు సంతోషంగా, మరికొందరు విచారంగా వున్నారు

''రేపే మన జాతకాలు'' రమణ మాటలు గుర్తుకొచ్చాయి మధుకు

రిజల్ట్సు వచ్చాయన్న ఆతృతతో పేపరుకోసం తిరుగుతున్నాడు. కాని ఎవ్వరు యివ్వడంలేదు.

''మధు, అభివందనాలు నీది ఫస్టుక్లాసు.'' తన చేతిలోనున్న పేపరు అందించాడు రమణ.

నిజమే ! మధు నెంబరు ఫస్టుక్లాసులో వుంది అంతేకాదు. తాను చదివిన యూనివర్సిటీకే ఫస్టు. రిజల్ట్సు కొద్దిగా మనశ్శాంతి నిచ్చాయి మధుకు

సంతోషంతో ఇంటికి వెళ్లాడు. అప్పుడే తన చెల్లెలు ప్రత్యక్షము, పుస్తకను లేదని

ఎలాగైతేనేమి, చివరకు చిన్న ప్రవేటు కంపెనీలో, రోజు కూలిగా ఉద్యోగము వచ్చింది మధుకు రోజుకు నాల్గు రూపాయలకు ఎక్కువ లేకుండా సంపాదించి, కుటుంబాన్ని నడిపిస్తున్నాడు మధు.

* * *

''అన్నయ్యా, నీకేదో కవరు వచ్చింది'' తన చెల్లెలు మాట వినిపించింది మధుకు.

''ఏదమ్మా ?'' ఆతృతగా అడిగాడు మధు.

ఎర్రటి కవరు చేతికందించింది పద్మ.

కవరు విప్పి చదివాడు మధు అంతులేని సంతోషం కలిగింది !

రేపే పెద్ద ఉద్యోగస్థుడు కాబోతున్నాడన్న కాంక్ష చెల్లెల్ని, తల్లిని పూలలో పెట్టి పెంచుతానన్న కోరిక, అన్నీ రేపే ఫలిస్తాయి.

'చెల్లి' గట్టిగా పిలిచాడు మధు.

'ఏమన్నయ్యా ?'

''రేపేనమ్మ, రేపే. ... . ''

''ఏమిటన్నయ్యా ?''

''రేపేనమ్మ. పెద్ద ఉద్యోగిని కాబోతున్నాను ఈ రోజుతో మన పేదరికమునకు స్వస్తి

'శంకరాభరణం'లో మంజుభార్గవి →

## ఇంకోసారి రా...

చెప్పేవ్వామమ్మా, ఎంప్లాయిమెంట్ ఆఫీసర్‌కు యిన్నాళ్ళకు నాపై దయ కల్గిందమ్మ

రేపే వీ రికార్డు కొంటావమ్మా అమ్మ వచ్చాక అమ్మతో ఈ విషయం చెప్పు, అని ఇంటర్వ్యూకు బయల్దేరాడు

*       *       *

క్యూలో నిలబడ్డాడు తన పేరు పిలవగానే లోనకు పోయాడు మధు గంభీరంగా నల్గురు ఆఫీసర్లు కుర్చీలలో కూర్చున్నారు

మధు స్వరూపము చూడగానే అతని బ్రతుకు ఆఫీసర్లకర్థమైంది మధుకు ఉద్యోగమిస్తే వారికి ముక్కిది విబూది అని

"నమస్కారమండి" రెండు చేతులు ఎత్తాడు మధు

"ఎంతవరకు చదువుకున్నావయ్యా?" అనడిగాడొక ఆఫీసర్

"ఏమైనా ఆస్తులున్నాయా?" అనడిగాడు మరొక ఆఫీసర్

"నీకు పెళ్ళి అయిందా?" అడిగాడు మూడవవాడు

ఈ ప్రశ్నలకు జవాబులెలా చెప్తే ఉద్యోగమిస్తారో అర్థమవలేదు మధుకు

ఫైలు తీసి, సర్టిఫికేట్లు చూపించాడు

అన్నీ ఫస్టుక్లాసులే కాని "ఫార్వర్డు" అన్నాడొక ఆఫీసర్, "ప్చ్" అని పెదవివిరచి

సగం మతి పోయినట్లు అనిపించింది మధుకు

"మరోసారి ఇంటర్వ్యూకు పిలుస్తాము అప్పుడు రావయ్యా!" అని తగిలేశారు మధును

అతనికి పూర్తిగా మతి పోయినట్లనిపించింది అంతేకాదు నిజంగా మతి పోయింది!

మతి పోయిన మధుకు ఇల్లు యెక్కడుందో తెలీలేదు

అన్న ఉద్యోగస్తుడై వస్తాడని చెల్లెలు, కొడుకు ఆఫీసరై వస్తాడని తల్లి, ఎదురుచూస్తూ వుండిపోయారు అతనికి యిల్లు ఎక్కడవుందో జ్ఞాపకం వస్తేకదా వస్తాడు? •





## సినిమా విశేషాలు

—జి.వి.జి

### బొట్టూ-కాటుకలో మృత్యుంజయుడు మరువలేని విందు

సరసు, రాజాకు అన్నం వడ్డిస్తూండగా తలుపు తట్టిన చప్పుడైంది ఇద్దరూ ఉలిక్కిపడ్డారు "సరసూ! నా అవుసు వైఫూ!" అన్న పిలుపు కూడా వినిపించింది

"అమ్మ బాబోయ్! మా ఆయనే, రాజా! వెళ్ళిపో!" అంది సరసు రాజా దొడ్డి గుమ్మం నుంచి పారిపోయాడు సరసు వెళ్ళి, తలుపు తీసింది మృత్యుంజయుడు "సరసూ, నా అవుసు వైఫూ!" అంటూ కౌగలించుకున్నాడు ఆమె మెల్లగా విడిపించుకొని, అతని కాళ్ళకు దణ్ణం పెట్టింది "మీకు దణ్ణం పెట్టుకొని, మూడు మాసాలైందండీ," అంది

మృత్యుంజయుడి దృష్టి విస్తరిమీద పడింది నోరు ఊరింది ఒకసారి ఆకును, ఒకసారి సరసును ఆశగా చూశాడు "సరసూ! మూడు నెలల తర్వాత నిన్ను చూశాను అలాగే నిండు విస్తరినీ చూశాను నీలాంటి అవుసు వైఫూ — ఈ వడ్డించిన విస్తరీ ఒకటేననుకో నోరూరి పోతోంది అవునూ, ఏంటి ఎవరో కెలికినట్లుంది!" అన్నాడు విస్తరిని మరింత పరిశీలనగా చూస్తూ

"కాదండి మీరు జైలునుంచి తిరిగొచ్చే రోజని — మీ కోసం పంచభక్ష్య పరమాన్నాలు చేసి ఉంచాను అవి ఎలా ఉన్నాయోనని కొంచెం రుచి చూశాను భోంచేయండి"

"భోంచేయనా?" అంటూ విస్తరి ముందు కూర్చొని, "సరసూ! ఒక్క ఫినిషింగ్ టచ్ ఇవ్వనా? జీవితంలో పెళ్ళయిన తర్వాత మొదటి రాత్రి, జైలునుంచి తిరిగొచ్చాక మొదటి భోజనం— మరువలేనివని అనుకో! అహ్హాహ్హా!" అంటూ ఆరగించసాగాడు

నూతన్ ప్రసాద్ (మృత్యుంజయుడు), పి ఆర్ వరలక్ష్మి (సరసు)తో పాటు శ్యాంప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "బొట్టు—కాటుక" చిత్రంలో శ్రీధర్, మురళీమోహన్, జయంతి, నిర్మల, మాధవి, బేబీగౌరి ముఖ్యభూమికలు నిర్వహించారు జంధ్యాల సంభాషణలకర్త చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి, జాలాది, ఉత్పల సత్యనారాయణాచార్య గీతాలు రాశారు జి కె రాము ఛాయ, సూరపనేని కళాధర్ శిల్పం, సత్యం సంకలనం పగ్గైరా తెరవెనుక హంగులతో విజయ బాపినీడు నేతృత్వంలో, దుర్గా నాగేశ్వరరావు దర్శకత్వంలో మాగంటి రవీంద్రనాథ చౌదరి నిర్మించిన ఈ చిత్రం త్వరలో విడుదలవబోతోంది



'దశ తిరిగింది'లో దీప



కలియుగ రావణాసురుడు'లో ఒక దృశ్యం

# సినిమా

## కొత్త దర్శకుల చిత్రాలు

ఎం ఆర్ మూవీస్ కీ॥ శే॥ తాపీ ధర్మారావు శిష్యుడు తోట రామమోహనరావు దర్శకత్వంలో సినీరంగంలో స్టిల్ ఫోటోగ్రాఫర్ విశేషానుభవం గడించిన సి ఎం ఎం రాయ్ "పట్టభద్రుడు" అనే పన్నెల చిత్రాన్ని కాకినాడ పరిసర ప్రాంతాలలో నెలరోజుల్లో ఒకే షెడ్యూల్‌లో నిర్మించడానికి నిశ్చయించారు "నవంబర్ చివరి వారంలో పాటల రికార్డింగ్ జరుగుతుంది సంగీత ప్రపంచానికి చిరపరిచితులైన ప్రాణలింగం మా చిత్రం ద్వారా సంగీత దర్శకుడుగా పరిచయమవుతారు డిసెంబర్‌లో షూటింగ్ పూర్తిచేసుకొని, నూతన వత్సర కానుకగా అందజేయడానికి సన్నాహాలు చేస్తున్నాం" అన్నారాయన ఛాయ, శిల్పం, కూర్పు, నృత్య దర్శకత్వాన్ని ఆర్ నాగేశ్వరరావు, బాలు, సుందరం, విజయకృష్ణ నిర్వహిస్తారు కథ, స్క్రీన్‌ప్లేను కూడా దర్శకుడే రాశారు

రీకో ఫిలిమ్స్ ఆలూరి రవి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి ఎస్ కృష్ణన్, ఎస్ విజయలక్ష్మి నిర్మించే చిత్రానికి మోదుకూరి జాన్సన్ స్క్రిప్టు రాస్తున్నారు ఆయనతో పాటు పి నారాయణరెడ్డి రెండు పాటలు రాస్తారు అవి జి కె వెంకటేశ్ స్వరకల్పనతో నవంబర్ 2, 3 తారీఖుల్లో రికార్డ్ చేయబడతాయి నవంబర్ 25 న షూటింగ్ ప్రారంభమవుతుంది చిరంజీవి, నూతన్‌ప్రసాద్, ప్రసాద్‌బాబు, రమణమూర్తి, రజినీకాంత్, కవిత, రోజారమణి, సువర్ణ, జయమాలిని, పండరీబాయి నటిస్తారు 'మాయల ఫకీరు' ఫేమ్ రంగస్థల నటుడు పల్నాటి వెంకట్రామయ్య ఒక ముఖ్యపాత్ర నిర్వహిస్తారట ఛాయాగ్రాహకుడు పి భాస్కరరావు ఎస్ లక్ష్మణరావు నిర్మాణ నిర్వాహకుడు

అపర్ణా కంబైన్స్ . "బాలలకు చెందిన ఒక ఇతివృత్తానికి దాక్యుమెంటరీ మసాలాలు జోడించి మూడు పంతులకు పైగా చిత్రీకరించాం ఈ బాలల సంవత్సరంలోనే విడుదల చేయాలని సంకల్పం" అన్నారు "ఆశాదీపాలు" పన్నెల చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నిర్వహించిన ఇ. పి రెడ్డి ఆయనతో కలిసి మద్దిపట్ల సూరి, దాశరథి గోపాలకృష్ణ సంభాషణలు రాశారు నూతన్‌ప్రసాద్, జయంతి, సత్యేంద్రకుమార్, శుభ, ప్రభాకరరెడ్డి, రావి కొండలరావు, విశ్వేశ్వరరావు, జయమాలిని, బేబీ రోహిణి, మాస్టర్ హరి, మాస్టర్ సునీల్ వగైరా తారాగణం సాయిప్రసాద్ ఛాయాగ్రాహకుడు బాలు సంకలన కర్త రామ్‌జీ నిర్మాత, సంగీత దర్శకుడు

జి పి పి ఫిలిమ్స్ లోగడ పలు తెలుగు చిత్రాలను తమిళంలోకి డబ్ చేసిన తమిళ రచయిత, నిర్మాత పురచ్చిదాసన్ స్వయంగా దర్శకత్వం వహించే "ఇదే నా సవాల్" పన్నెల చిత్రంలో రజనీకాంత్, రీనా, ప్రభాకరరెడ్డి, నాగభూషణం, కాంతారావు, త్యాగరాజు, రామదాసు, సిలోన్ మనోహర్, ఆనందమోహన్, పెమ్మసాని రామకృష్ణ, ఆనంద్, లక్ష్మిశ్రీ, పండరీబాయి నటిస్తున్నారు రచన, సంగీతం, ఛాయ, శిల్పం, కూర్పులను జి కె మూర్తి, ఇళయరాజా, దేవరాజ్, బి చలం, రాజన్ నిర్వహిస్తున్నారు కృష్ణకిశోర్, చంద్ర సహదర్శకులు ఈ చిత్రం తమిళంలో కూడా తయారవుతోంది

పూంపుహార్ ప్రొడక్షన్స్ · తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి ఎం కరుణానిధి నెలకొల్పిన ఈ సంస్థ లోగడ కొన్ని తమిళ చిత్రాలు నిర్మించింది ఆయన మేనల్లుడు సెల్వం నిర్మాతగా వచ్చే మే, జూన్, జూలై నెలల్లో తయారయ్యే పన్నెల చిత్రంలో కృష్ణ హీరో నూతన్‌ప్రసాద్, సత్యనారాయణ, కన్నడ మంజుల ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తారు నాయికగా కొత్త నటి పరిచయం గావింపబడుతుందట మహారథి రచయిత ఎం ఎస్ విశ్వనాథం సంగీత దర్శకుడు టి ఎస్ కిశోర్ నిర్వాహకుడు స్క్రీన్‌ప్లే, ఛాయాగ్రహణం, దర్శకత్వ బాధ్యతలు వహించే అమృతంకు ఇది తొలి తెలుగు చిత్రం

ఆర్ కె బత్తుల ఫిలిమ్స్ హైదరాబాద్ పరిసర ప్రాంతాలలో పూర్తిగా ఔట్‌డోర్‌లో తయారైన "దప్పు సాయినాడు" చిత్రాన్ని ఆర్ కె బత్తుల కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఆయనతోపాటు సోమా మల్లికార్జునరావు, సోమా జగదీశ్వరరావు నిర్మించారు రాధాస్వామి, రత్నకుమారి, రాకేష్, సుమిత్ర, నాగేశ్వరరావు, రోజాశ్రీ, విజయమాధవి నటించారు కె వి రమణరావు మాటలు, ఆచార్య తిరుమల పాటలు రాశారు గోపాలకృష్ణ సంగీత దర్శకుడు ఎస్ మణి ఛాయాగ్రాహకుడు

అంతర్జాతీయ బాలల సంవత్సరంలో
ప్రియతమ నాయకుడు చాచానెహ్రూ
జన్మదినసందర్భాన బాలలకు
అపూర్వకానుకగా...

శ్రీరాజలక్ష్మీ ఆర్ట్ పిక్చర్స్

# నిండునూరేళ్ళు

ఈస్ట్మన్ కలర్

గంగాధర్



దర్శకత్వం: కె.రాఘవేంద్రరావు B.A., నిర్మాత: మిద్దే రామారావు

SREEPUBS విజయకృష్ణా మూవీస్

చిత్రీకరించినట్లు తెలియజేశారు అవిల్ ప్రొడక్షన్స్ "ఛాలెంజ్ రాముడు" వన్నెల చిత్రానికి దర్శకత్వం వహించిన టి ఎల్ వి ప్రసాద్

ఎన్ టి ఆర్, గీత, సత్యనారాయణ, గుమ్మడి, మిక్కిలినేని, కాంతారావు, రాళ్ళపల్లి, హరిబాబు, మాస్టర్ పురుషోత్తమ్, పుష్పలత, సత్యకళ, రాజేశ్వరి, జయమాలిని ఇతర ముఖ్య పాత్రధారులు మహేంద్రన్ కథకు జంధ్యాల సంభాషణలు, చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి, ఆత్రేయ గీతాలు రాశారు దేవరాజ్ ఛాయాగ్రాహకుడు శిల్పం, కూర్పు, ప్రొడక్షన్ను తోట, కణ్ణన్, కృష్ణమూర్తి నిర్వహించారు నిర్మాత తాతినేని ప్రకాశరావు వీరి ఇదివరకటి చిత్రం "కుడి ఎడమైతే" శతదినోత్సవం నవంబర్‌లో భాగ్యనగర్‌లో జరుగుతుందని తెలిపారు ఈ సందర్భంలో ఈ చిత్రం తాలూకు వ్యాసరచన పోటీలో గెలుపొందినవారికి బహుమతీప్రదానం జరుగుతుంది

### గురు చిత్రం జనవరి 14న విడుదల

"జుగ్ను" హిందీ హిట్ చిత్రం ఆధారంగా ప్రమోద్ చక్రవర్తి సమర్పణలో ఆర్ సి ప్రకాష్ నిర్మించే "గురు" వన్నెల చిత్రం నాల్గవ షెడ్యూల్ అక్టోబర్ 17 నుంచి 29 వరకు జరుగుతుందన్నారు డైరెక్టర్ ఐ వి శశి కమలహాసన్, శ్రీదేవి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, మోహన్‌బాబు, కాంతారావు, జయమాలిని పాల్గొంటున్నారు జంధ్యాల మాటలు, ఆత్రేయ పాటలు, ఇళయరాజా సంగీతం ఇతర ఆకర్షణలు "ఔట్‌డోర్ షెడ్యూల్ నవంబర్‌లో ఊటీలోగాని, కాశ్మీర్‌లోగాని జరుగుతుంది," అన్నారు ఈ చిత్రానికి యావత్ప్రపంచ హక్కులు పొందివున్న సుజాత వెంకటేశ్వరన్ శ్రీ శక్తి ఫిలిమ్స్ బానర్‌లో నిర్మాణం [36వ పేజీ చూడండి]

'సూపర్‌మాన్'లో జయప్రద

## సినిమా

### ఛాలెంజ్ రాముడులో రాజా పోటీకి మూల

రాజా (నూతన్‌ప్రసాద్) షిప్‌లో పని చేస్తున్నాడు ఆ షిప్‌లో ప్రయాణం చేస్తున్న అరుణ (జయప్రద) అతన్ని ఆకర్షించింది ఆమెను ప్రేమించాలని తహతహలాడిపోయిన రాజా "హలో, మిస్! వెల్‌కమ్ ఎబోర్డ్ చిదంబరం! మీరు భారతీయులని మీ కట్టూ బొట్టూ చెప్తోంది నా పేరు రాజా మీ పేరు రాణి అయితే నా అదృష్టం కాకపోయినా సర్దుకుపోగలను బై ది బై — నేను అందగాడ్నే అయినా, అందానికి బానిసను నేను మంచివాడ్నే అయినా — మంచితనానికి సేవకుడ్ని," అన్నాడు

ఇంతలో అరుణ తమ్ముడు మధు అందుకుంటూ, "మిస్టర్, నువ్వు మాట్లాడుతూంటే కంపు కొడ్తోంది," అన్నాడు

"దీన్ని కంపనరు, బాబూ! వాసనంటారు సింగపూర్‌లో తెలుగు చదివినట్లున్నావ్ నేను మాట్లాడితే, మల్లెల వాసన వస్తుందంటారు అందరూ అరుణా! మీరేమంటారు?" అన్నాడు రాజా

"షటప్!" అంది అరుణ

అదిరిపడి, అవాక్కయిపోయాడు రాజా

కేరళలో నౌక వద్ద ఎన్నో కీలక సన్నివేశాలు

శ్రీ రాఘవేంద్ర మహిమ [మంత్రాలయ మహాత్మ్యం]లో రాజకుమార్



# ముద్దు బిడ్డ మొదటి ఘన ఆహారం. ఇందులో సులభంగా జీర్ణమయ్యే బియ్యం, పుష్టికరమైన 11 విటమినులు, మరియు యినుము కలసివున్నాయి

# నెస్టమ్

## బిడ్డలకై తయారు చేయబడిన బియ్యపు సారం.

మీ ముద్దు బిడ్డకు ఘన రూపమైన ఆహారం పెట్టటం ప్రారంభించారంటే, ఆ బిడ్డకు మంచి పుష్టినిచ్చే ఆహారం యివ్వండి. అంతేకాదు, ఆ ఆహారం అతి సున్నితమైన ఆ బిడ్డ జీర్ణావయవముల మీద తేలికగా పనిచేసేదిగా కూడా వుండాలి. సులభంగా జీర్ణమయ్యే ధాన్య ఆహారం బియ్యమేనని డాక్టర్లు అంగీకరించారు. అందుచేతనే మేము బియ్యంతో నెస్టమ్ క్రీమ్ తయారు చేశాము. ఇందులో మీ బిడ్డ ఆరోగ్యంగా పెరుగుటకు ముఖ్యంగా అవసరమైన విటమినులు, ఇనుము తగినంత పాళ్లలో చేరియున్నది.

మీ ముద్దు బిడ్డకు 3 నెలలు నిండగానే యీ ఆహారం యివ్వడం ప్రారంభించవచ్చు. బిడ్డ పెరిగే కొద్దీ, యీ ఆహారానికి పండ్లు, కాయగూరలు, పప్పు, కలిపి, క్రొత్త క్రొత్త రుచులు చవి చూపించవచ్చు మెల్ల మెల్లగా.







గరిష్ట ధర
రు. 7-00
స్థానిక పన్నులు
అదనం.

**పూర్తి పోషక పదార్థములతో సులభంగా జీర్ణమగు నిండు ఆహారాన్ని తయారు చేయుటకై దీనిని పాలతో కలపండి.**



ముందుగా
కాచియుంచిన
పాలను వంచుకోండి.



దానికి నెస్టమ్
కలపండి.



వెంటనే యిచ్చుటకు
తయారు




SAA/FSL/N/1134



# సుదూర తీరాలు

*(గత సంచిక తరువాయి)*

ఆ సాయంత్రం కాంతిమతి చెప్పిన ప్రకారం స్నానం చేసి, ఆవిడిచ్చిన తెల్లచీర జాకెట్టూ వేసుకోక తప్పలేదు మోపెడు మల్లెలు తెచ్చి తల్లో తురిమింది

'ఇప్పుడివన్నీ ఎందుకు ?'' అంటున్న మల్లిని మోటుగా దగ్గిరకు లాగి ముద్దుపెట్టుకుంటూ, 'పెళ్ళికూతురిలా వున్నావు ఎందుకేమిటి ? ఆడపిల్లలు బొట్టూ కాటుకా పెట్టుకొని చక్కగా పూలు పెట్టుకుంటే చూడటం నాకెంతో యిష్టం కదు సూర్యం'' అంటూ లతనివైపు చూసి నవ్వింది

సూర్యం వైపు చూసిన మల్లికి అతను తనను మింగేసేలా చూడటం చూస్తే భయమేసింది

అంతలోనే సర్దుకుంటూ చూపులు మార్చి, పర్వాలేదు మల్లీ! మల్లెపూలు మల్లి అందాన్నిస్తాయో, మల్లి మల్లెపూల కందాన్నిస్తుందో చూడాలని మా కుంతి అభిప్రాయం''

''నాకు మట్టుకు మల్లి, మల్లెపూల కందమిస్తోందనిపిస్తోంది ఏమంటావు కుంతీ ?''

'అవును నాకూ అలాగే అనిపిస్తోంది ఎందుకంటే ఎంత బావుందో, ఆ పావడా వోణీ వేసుకుంటే పొట్టిగా పరీ యింత ఎల్లలా కనిపించింది యిప్పుడు మనిషిలా నిండుగా కనిపిస్తోంది ''

వాళ్ళు తననలా మంచోబెట్టి పొగుడుతుంటే సిగ్గుతో ఎర్రబడ్డాయి మల్లి బుగ్గలు తననెవరూ ఎప్పుడూ అంతగా పొగడలేదు

ఏవేవో స్టూడియో కబుర్లు సూర్యం చెబుతుంటే వింటూ అలాగే పదింటివరకూ హాల్లో కూర్చున్నారు ముగ్గురూ అప్పటికే నిద్రను కంట్రోల్ చేసుకుంటున్న మల్లి అవస్థ చూసి,

'వెళ్ళి పడుకో మల్లీ రేపు స్టూడియో కెళదాం! మా బావగారు కూడా వచ్చేస్తారు రేపు' అంటూ పైకి పంపిం మల్లిని

''నేను కాసేపు కూర్చొని వచ్చి పడుకుంటాను తలుపులు దగ్గిరకు వేసి పడుకో'' అంటూ అక్కడే కూర్చుంది కాంతిమతి

మల్లి పైకి వెళ్ళిన పదిహేను నిముషాలకు కాంతిమతి యింటిముందుకు వచ్చిన టాక్సీలో ఎక్కి సూర్యానికి గుడ్‌నైట్ చెప్పి వెళ్ళిపోయింది

తలుపులు బిగించి, నెమ్మదిగా ఒక్కో మెట్టే ఎక్కి పైకి చేరుకున్నాడు సూర్యం అతిమెల్లగా తలుపులు తోశాడు అప్పటికే గాఢనిద్రలో మునిగి ఎసపాపలా ముడుచుకొని పడుకొనివుంది మల్లి బెడ్‌లైట్ వెలుగుతోంది ఆ చిరువెలుగులో పాలమీగడలాంటి ప్రక్కమీద అంతకంటే తెల్లనైన బట్టల్లో, పాలరాతి బొమ్మలా మెరిసిపోతున్న ఆ అపూర్వ సౌందర్యం సూర్యాన్ని పిచ్చివాడిని చేస్తుంటే, నెమ్మదిగా బెడ్‌లైట్ కూడా ఆఫ్ చేసి మంచం చేరుకున్నాడు

మంచంమీద పక్కనే పడుకొని నెమ్మదిగా మల్లిని తనవైపు తిప్పుకున్నాడు

నిద్రలో మత్తుగా మూలుగుతూ అతనిమీద చేయివేసి పడుకుంది

తెల్లవారింది కళ్ళు విప్పి ప్రక్కకు చూసిన మల్లికి తన బ్రతుకూ తెల్లవారిందని తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు ప్రక్కనే ఆదమరచి మత్తుగా నిద్రపోతున్న సూర్యం, అస్తవ్యస్తంగా వున్న తన బట్టలు, అంతా అయోమయం, గందరగోళం

రాత్రి నిద్రలో ఏవేవో కలలు వచ్చాయి అనుకుంది తనకూ బావకూ పెళ్ళైనట్టూ, ఒక్కటే డ్రెస్‌లో తన కిష్టమైన రీతిలో తన దగ్గరకు చేరిన బావ కౌగిట్లో ఒదిగిపోయినట్టూ, ఏదో ఏదో అయిపోయినట్టుగా బాధగా అనిపించినా ఏదో తెలీని వింత అనుభూతితో ఆ బాధను భరించింది

కళ్ళు తెరచిన తర్వాతగానీ అదంతా నిజంగా జరిగిందనీ, తన కోరికలకు బలితీసుకుంది సూర్యమని బావ కాదనీ అది కలకాదనీ తెలిసిరాలేదు

నిన్నటి వరకు అతను మోకాలు గీసుకోకుండా లేక చొక్కా చింపుకోకుండా ఇంటికి రాలేదు. ఈరోజు అతను వాటికి దూరంగా వున్నాడు. మగాడు అయ్యాడు. అతను గొంతులోని ముద్దను దిగమింగటానికి ప్రయత్నిస్తూ, అమ్మవంక చూసి నవ్వుతున్నాడు. ఈ విశాల ప్రపంచంలో పెద్ద మనిషిగా వుండటానికి అతనికతనే తోడ్పడాలి. పోట్లాటలను తనే ఎదిరిస్తూ తను సాధించిన వాటిని సుద్దతో గీస్తున్నాడు. ఈరోజు కోసం పొదుపు చేయటం వలన మీరు ఆనందించట్లేదా? అతను ఫుట్‌బాల్ కోసం అరిచినా మరియు జారే స్కేటింగ్ కోసం ఏడ్చినా మీరు ప్రతినెలా కొంత సొమ్మును ప్రక్కకు వేస్తున్నారు. అది అతని భవిష్యత్‌ను ఒక డాక్టరుగానో, ఒక ఇంజనీయరుగానో లేక ఒక న్యాయవాదిగానో ... అతను ఏమి కోరితే అదే! అతను కోరాడు. మరియు 8 సంవత్సరాల కాలములోని మీ మొత్తాన్ని కెనరా బ్యాంక్ కామధేను డిపాజిట్ రెట్టింపు చేసింది. అతను తన సొంత షరతులతో ప్రపంచంతో కలవటానికి తయారయినపుడు, గర్వంతో, సంతోషంతో, విచారంతో మీరు చూస్తారు. తండ్రియొక్క ముందు చూపు! మరియు ఎంతో కావలసినంత తృప్తి! కెనరా బ్యాంక్ లో కామధేను డిపాజిట్ ఖాతా తెరిచిన ఆ రోజును ఎంతో మంది తండ్రులు దీవించారు!




# కెనరా బ్యాంక్

(భారత ప్రభుత్వ సంపూర్ణస్వామ్యంలోనిది)

**లెక్కవేమీ కాదు; 'ఏ డిపాజిట్ అయినా**

# రెక్కలురాని పక్షులు గూడు విడిచితీరాలి.

విజం తెలిసిన మరుక్షణం తనమీద తన కసహ్యమేసింది సూర్యాన్ని చంపేయాలన్నంత కోపమొచ్చింది ఆ దెయ్యం కాంతిమతి యెక్కడ వచ్చింది ఇతనెలా వచ్చాడిక్కడికి? యింత ఘోరానికి తలబడితే సాటి ఆడదైవుండీ, తనవి రక్షించే ప్రయత్నం చేయలేదా కాంతిమతి?

అయినా తనకంత మొద్దునిద్రెలా పట్టింది? రెండు చేతుల్లో ముఖం కప్పకొని భోరున ఏడుస్తూన్న మల్లి ఏడుపుకు కళ్లు విప్పిన సూర్యం,

"ఓ! టేకిట్ యీజీ బేబీ! ఏం కొంప లంటుకుపోయాయని అలా ఏడుస్తావు? అయినా, నీకప్పుడే మెలకువ యెలా వచ్చింది? స్లీపింగ్ పిల్స్ కూడా నీ మీద పని చేయలేదే కనీసం మధ్యాహ్నం వరకైనా నిద్రపోతావనుకున్నాను ఇప్పుడే లేచి ఏం చేయాలీ, పడుకో డియర్" అంటూ మల్లిని మీదకు లాక్కోబోయిన సూర్యం, విసురుగా వచ్చి బుగ్గను తాకిన మల్లి చేతిని గట్టిగా పట్టుకున్నాడు

"పిట్ట కూతకొచ్చిందే నన్నే కొట్టేంత ధైర్యం వచ్చిందన్న మాట యిప్పుడు నేను తప్ప నీకీ ప్రపంచంలో ఎవ్వరూ లేరన్న మాట గుర్తుంచుకో మీ వూరివాళ్ళందరి దృష్టిలో నువ్వు లేచిపోయి వచ్చినదానవు నీ విలువ అంతే యిక మర్యాదగా మసులుకుంటే నా హృదయ రాణిగా శాశ్వతంగా వుంటావు లేదా శాశ్వతంగా కుక్కబ్రతుకు బ్రతకాల్సివస్తుంది నీ బావ వచ్చి నిన్ను రక్షిస్తాడనుకుంటున్నావేమో! అది కలలో కూడా జరగని పని అండర్‌స్టాండ్! బి కేర్‌ఫుల్ వెర్రివేషాలు వేయడానికి ప్రయత్నిస్తే ఈ సూర్యం జ్వాలాగ్నిలో మలమలా మాడి ఛస్తావు" అంటూ విసురుగా తోశాడు సూర్యం

మంచంకోడుకు తల కొట్టుకొని బొటబొటా రక్తం కారింది అరచేత్తో నుదుట చేయి వుంచుకొని నెమ్మదిగా మంచం దిగుతున్న మల్లిని చెయ్యిపట్టి లాగిన సూర్యం, రక్తం చూచి "మై గాడ్! ప్రొద్దున్నే బ్లడ్ చూపించావే పూలిష్‌గా వుండకుండా, చెప్పిన మాట విను" అంటూ ప్రక్కనే డ్రాయర్‌లో వున్న ఫస్ట్ ఎయిడ్ బాక్స్ తీసి దూదితో రక్తం తుడిచి తలకు చిన్నగా బాండేజ్ చేశాడు

కళ్ళనిండా నీళ్ళతో మౌనంగా భయంగా కదిలితే చంపుతాడేమో అన్నంత భయంగా చూస్తున్న మల్లి అమాయకమైన ముఖం చూసి. ఒక్క క్షణం తను తప్పు చేశానేమో అనే ఫీలింగ్ కలిగింది సూర్యంలో

నెమ్మదిగా మల్లి గడ్డం పట్టుకొని పైకెత్తాడు

రప్ప తప్పన నీళ్ళు జారి బుగ్గలమీద పడ్డాయి

సూర్యంలో మానవత మేల్కొంది మొదటి నుంచీ తను మల్లి విషయంలో చాలా సాఫ్ట్‌గానే ప్రవర్తించాడు తనకు తెలీకుండానే ఆ అమాయకమైన పెద్ద పెద్ద కళ్ళను ఆరాధించాడు అవి తన సొంతం చేసుకోవాలని కలలు కన్నాడు అదీ క్రూరంగా కాదు సున్నితం అతిమృదువుగా తనదాన్ని చేసుకోవాలనుకున్నాడు

కానీ రాత్రి ఆవేశంలో తొందరపడ్డాడు ఫలితం తెల్లవారే మల్లిని ఏడిపించడం ఆలోచిస్తూ మల్లి కళ్లలో కళ్ళుంచి చూస్తున్న సూర్యం కళ్లలో అప్రయత్నంగానే నీళ్ళు సుళ్ళు తిరిగాయి ఆమె తల నలాగే ఆర్తిగా హృదయానికి హత్తుకున్నాడు

"అందుబాటులో వున్నది, శత్రువైనా, మిత్రుడైనా ఆత్మీయంగా గుండెలు అండగా





"కోవెల కాంతులు"—సాధారణ బహుమతి పొందిన ఫొటో

చూపిస్తే ఆ గుండెలపై వాలి తనివితీరా ఆక్రోశించడంలో అతిశయోక్తి ఏమీలేదు"

ఆ క్షణాన అతని వల్లే తన జీవితం సర్వనాశనమైందనే విషయాన్నికూడా మరచి, పసిపాపలా అతన్ని అంటుకుపోయి బావురుమంది మల్లి

రాత్రంతా మాధవ్ అనే, ఆలోచనల్లో ఆనందంలో తేలిపోయిన మల్లి మెలుకువ వచ్చాక కూడా అవి మాధవ్ గుండెలనుకొని ఆక్రోశించడానికి అవకాశం లేదు కానీ ఆ క్షణంలో సూర్యం కళ్లలో కనిపించిన ఏదో భావం, తన గుండె బరువు తీర్చుకొమ్మంది చాలాసేపు అలాగే ఏడవనిచ్చి మెల్లిగా మల్లి కళ్ళు తుడిచి,

"లే మల్లీ! లేచి స్నానం చేసిరా! కాఫీ తెప్పిస్తాను' అంటూ తనూ మంచం దిగాడు సూర్యం

మంత్రముగ్ధలా కాలకృత్యాలు తీర్చుకుంది మల్లి వెళ్లి ప్రక్కమీద పడుకుంది బలవంతాన ఒక యిడ్లీ తినిపించగలిగాడు సూర్యం

కాఫీ తాగి సిగరెట్ కాల్చుకుంటూ హాల్లో కూర్చున్నాడు మల్లి అలాగే ఏడుస్తూనేవుంది ఆ ఏడుపుకు అంతంలేదేమోనన్నంతగా ఏడుస్తోంది

అయితే ఏడుస్తూనే తన పరిస్థితిని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తోంది "తన మనసులో బావకు తప్ప మరొకరికి స్థానం లేదు బావతో భావిజీవితాన్ని గురించి తను కన్న కలలన్నీ ఒక్క రాత్రితో యిలా నామరూపాల్లేకుండా పోతాయని ముందుగానే తెలిసివుంటే ఎంత బావుండేది అమ్మ యెంత బాధపడుతోందో మాష్టారు యెంత ఖంగారుపడుతున్నారో బావకు ఈ విషయం తెలిస్తే తన నెంత అసహ్యించు కుంటాడో!

హార
లు

తన పాటం పిచ్చి, తననింత దూరం తీసుకొచ్చింది. చిన్నప్పటినుంచీ మాష్టారు తనతో సాధన చేయించకుండా వుండివుంటే ... బావ కూడా తనని ప్రోత్సహించకుండా వుండివుంటే ... ఈనాడు తన బ్రతుకిలా సర్వనాశనమై వుండేది కాదు.

ఛీ! తనెంత నీచురాలు. తన అభివృద్ధి కోరి ప్రోత్సహించిన వాళ్లను తప్పుపడుతోంది. తన అవివేకానికి వాళ్ళెలా బాధ్యులు?'' కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తోంది మల్లి.



హెచ్ కోదండపాణిరావు (హైదరాబాద్)

హాల్లో కూర్చున్న సూర్యం కూడా ఆలోచిస్తున్నాడు. సిగరెట్లమీద సిగరెట్లు తగలేస్తున్నాడు. ఎందుకో మల్లి అందరిలాంటి పిల్ల కాదనిపిస్తోంది. ఇంతక్రితం ఎక్కడికి వెళ్లినా, ఓ చక్కటి చుక్కను పట్టడం, తన ఇష్టమైతే తనొక్కసారి అనుభవించడం, ఆ తర్వాత కాంతిమతికి అప్పజెప్పటం చేస్తుండేవాడు. దానికి తగ్గట్టు కాంతిమతి తనకు బాగానే ముట్టజెప్పుతుంది. అలాగే మల్లినీ పట్టి తీసుకొచ్చాడు. కానీ ఎందుకో అమాయకమైన ఆ కళ్లు చూస్తుంటే అంతులేని ఆత్మీయత కలుగుతోంది. ఇంతక్రితం ఎవ్వరి విషయంలోనూ కలగని ఓ దగ్గరతనం, ఓ స్వంతభావం కలుగుతోంది. తను మల్లిని పర్మనెంట్‌గా వుంచేసుకుంటే

కానీ కాంతిమతి అందుకు వచ్చినా వప్పుకోదు. కావాలంటే మరో నాలుగురోజులు నీదగ్గరే వుంచుకొని బుద్ధి తీర్చుకోమంటుంది గానీ శాశ్వతంగా మల్లిలాంటి పిల్లను తనకు వదిలేయదు.

మల్లి విషయంలో కాంతిమతితో పోట్లాటకైనా సిద్ధపడాలనిపిస్తోంది. అది చాలా ప్రమాదకరమైన సంగతని తెలుసు. దాని చేతుల్లో వస్తాదుల్లాంటి రౌడీలుంటారు. వాళ్ళు తలుచుకుంటే తనను నల్లిని నలిపినట్లు నలిపేయగలరు. అయినా ఎందుకో మల్లిని కాంతిమతికి అప్పజెప్ప డానికి మనస్సు, సుతరామూ అంగీకరించడంలేదు.

"ప్రతి మనిషికీ మనసుంటుంది, ఆ మనసుకు మమతుంటుంది, అది బయటపడటం సంభవిస్తే నిర్భయంగా బయటపడుతుంది. మనిషిని మమత, బానిసగా మార్చేస్తుంది. ఒక్కోసారి మనుగడలో మహత్తరమైన, మధురమైన మార్పునే తీసుకొస్తుంది ఆ మమత'' అదే జరిగింది సూర్యం విషయంలో. ఏమైనాసరే మల్లికను కాంతిమతికి అప్పగించకూడదనుకున్నాడు. గబగబా లేచి మల్లి గదిలోకెళ్ళాడు.

"మల్లీ! నేను చెప్పేది ప్రశాంతంగా విను. నేను చెడ్డవాడినే కాదనను. పరమదుర్మార్గుడినే. నీ జీవితంలో నిప్పులు పోశాను, నీ యిష్టమొచ్చి నట్లు తిట్టు భరిస్తాను. కానీ మల్లీ నేను నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. దీన్నిమాత్రం నమ్ము. నువ్వు నమ్మకపోయినా నేను నష్టపోయేదేమీలేదు''

"అసలు నా వృత్తి అమ్మాయిల్ని తీసుకొచ్చి కాంతిమతికి అమ్మడం. యిప్పటివరకూ ఎందరినో అలా అమ్మేశాను. కాంతిమతి నా అక్క కాదని ఈపాటికి గ్రహించివుంటావు. అది అమ్మాయిల్ని పెట్టుకొని వాళ్ళచేత వ్యభిచారం చేయించి, డబ్బు సంపాదిస్తుంది. దానికి దయాదాక్షిణ్యాలు లేవు. ఇన్నాటివరకూ నాకూ లేవు. చాకచక్యంగా అమ్మాయిలను వశపరచుకోడమే తెలుసు''

"కానీ కానీ ఈరోజెందుకో నా మనసులో ఏదో అలజడి చెలరేగింది. ఏదో స్పందన మొదలైంది. నిన్ను ఆ కాంతిమతి చేతుల్లో పెట్టడానికి నా మనసంగీకరించడంలేదు. జరిగిందేదో జరిగిపోయింది. గతాన్ని మరచిపో. నేనూ మరిచిపోతాను. మనిద్దరం భార్యాభర్తలుగా గౌరవంగా బ్రతుకుదాం. ఇందులో మోసమేమీ లేదు. నీకు నమ్మకం లేదంటే ఈరోజే గుడికెళ్లి దండలు మార్చుకుందాము. ఆ సర్వాంతర్యామి సమక్షంలో. బాగా ఆలోచించుకో, నీకే జీవితం కావాలో! ఇంకో రెండురోజుల వరకూ రావద్దని కాంతిమతికి ఫోన్ చేశాను. ఈలోపు నీ నిర్ణయం నాకు చెప్పాలి'' అంటూ మృదువుగా చెబుతున్నాడు సూర్యం.

అతని అసలు స్వరూపం తెలిసిన తర్వాత మల్లిలో దుఃఖం కట్టలు తెగింది.

"ఛీ! ఇలా మృదువుగా మెత్తగా మాట్లాడి కన్నీళ్ళు కార్చి నన్ను వంచించావు. ఇంకా నీ మాటలు విని మోసపోవడానికి సిద్ధంగాలేను. అలాంటి పరిస్థితే వస్తే కాంతిమతి చేతికి చిక్కను నేను. నాకింక ఏ జీవితమూ వద్దు'' అంటూ భోరున ఏడుస్తూ బెడ్ మీద పడిపోయింది మల్లి.

సాయంత్రం వరకూ అలా ఏడుస్తూనే వుండిపోయింది. సూర్యం భోజనానికి లేపితే లేవలేదు. అతనూ అలాగే ఆ భోజనంగానే కూర్చున్నాడు. సూర్యం ఆ సాయంత్రం లైట్ వేసి, మల్లి దగ్గరకు రాగానే ఉలిక్కిపడి లేచి కూర్చుంది మల్లి.

చిన్నగా నవ్వుతూ "భయపడకు నిన్నేం చేయను. నా మాట విని ఈ గ్లాసు పాలు త్రాగు. నేను క్రింద కెళ్లిపోతాను. కావాలంటే నీ గది లోపల గడి వేసుకో'' అంటూ మృదువుగా గ్లాసు మల్లి పెదాల కానిస్తే అతని కళ్లలోని ఏదో మహత్తర శక్తికి కట్టుబడి పాలు త్రాగేసింది.

"దట్స్ వెరీగుడ్! హాయిగా పడుకొని నిద్రపో గుడ్‌నైట్'' అంటూ తలుపులు దగ్గరగా వేసి నవ్వుతూ క్రిందకు వెళ్లిపోతున్న సూర్యం ప్రవర్తన వింతగా తోచింది.

ఇంత మృదువుగా మాట్లాడే మనిషి ప్రొద్దుట అంత మోటుగా ఎలా ప్రవర్తించాడు? అంతలోనే విసిరికొట్టడం, అంతలోనే అక్కున చేర్చుకోడం, యిదా మనిషిలోని ప్రత్యేకతలేమో! విచిత్రమైన మనస్తత్వం. తనని ప్రేమిస్తున్నాడట. అందుకని కాంతిమతికి అప్పజెప్పడట. యిదీ ఓ నాటకమేమో! ఏమో! యిది నిజమే కావచ్చు. అతని ముఖం చూస్తే అతను అబద్ధమాడుతున్నట్లనిపించలేదు.

అవును ఆ ముఖం చూసేగా తను మోసపోయింది! ఎందుకైనా మంచిదని లేచి తలుపులు గడివేసింది మల్లి.

అతని అందమైన డ్రెస్సింగ్ చూసి తను ఎంత ముచ్చటపడింది? పైగా బావ అలా వుండనందుకు బావమీద ఎక్కడలేని కోపమూ వచ్చింది. అందమైన మేకతోలు కప్పుకున్న పులి అని తెలిసివుంటే సూర్యం దరిదాపుల్లోకి వెళ్ళి వుండేదికాదు.

తన అందాన్ని చాకచక్యాన్ని చూపి మృదువుగా ఆడపిల్లల మనసులు దోచి, వాళ్ళను నమ్మించి తనవెంట తీసుకువచ్చి అతను చేసే వ్యాపారం ఎంత నీచమైనది? ఇంతటి నీచుడిలో తనపట్ల మాత్రం అలా భిన్నమైన అభిప్రాయం ఎలా కలిగింది? అది తన అదృష్టమనుకోవాలా? దురదృష్టమనుకోవాలా! తను అతనికి మనసిచ్చి అతని వెంటబడలేదు. కానీ అతను అందంగా అల్లిన వలలో అవలీలగా చిక్కుకుపోయింది.

ఇప్పుడు తప్పించుకునే మార్గం లేదు. తిరిగి వెళ్ళి బావకు, అమ్మకు, మాష్టారికీ ముఖం చూపించే అర్హతను కోల్పోయింది. తన మలినమైన శరీరాన్ని అంతం చేసుకోవడమో లేక గతానికి సమాధి కట్టి సూర్యంతో మనసులేని మనువు సాగించడమో లేదా కాంతిమతి

**జరిగిన కథ-4 :** స్కూలు మాస్టరు దశరథరామయ్యగారి కుమారుడు మాధవ్ ఓ కంపెనీలో మేనేజర్ వారింట్లో వంట చేస్తున్న అన్నపూర్ణమ్మ కూతురు మల్లీ మాధవ్ తను వ్రాసిన పాటలు పాడించుకొంటూ పరస్పరానురాగబద్ధులవుతారు కాని అతని పల్లెటూరి వేషధారణ మాత్రం ఆమెకు నచ్చదు మున్సబుగారు మాధవ్‌ను తన అల్లుడిగా చేసుకోవాలని పథకం వేస్తుంటాడు మల్లిని మంచి గాయనిగా గుర్తించి తమ పిక్చర్‌లోని పాటలు పాడటానికి, గొప్ప గాయనిగా పేరు ప్రతిష్టలు పొందటానికి తనతో మద్రాసు రమ్మని అర్థిస్తాడు సూర్యం అతని మాటలను నమ్మిన మల్లిక ఆ మరునాటి రాత్రి ఎవ్వరికీ చెప్పకుండా అతనితో వెళ్ళిపోతుంది ఆ కారణంగా ఆమె తల్లి ఆ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకొంటుంది సూర్యం అసలు రంగు ఆమెకు అవగాహన అవుతూవుంటుంది

# వలపు

తొలి చూపు చూసింది, తొందరలు చేసింది,
మలి చూపులో, నాడు మనసు లాగేసింది,
పలుకరించకముందె పకపకా నవ్వింది
చిలిపి సైగలతోడ చీకాకు పరచింది
మాటాడవాయన్న, మౌనమును దాల్చింది
ఏటికో ఊగా అలుక ఎరుగలేకున్నాను
అన్న! పొరపాటది ఆ రోజు ఎరుగను,
చిన్నతనపు సిగ్గు మొన్న గ్రహియించాను
మనసీయవా మళ్ళి, మాటాడవా నాతో
పెనవేసుకున్నాయి ప్రేమానుబంధాలు

— *బంద్యాల బాలవరలక్ష్మి*

చేతచిక్కి బ్రతుకును మరింత నికృష్టంగా మార్చుకోడమో! ఈ మూడు మార్గాలే తన ముందున్నాయి. ఏది కోరుకోవాలో తేల్చుకోడానికి నలభై ఎనిమిది గంటల టైమ్ వుంది ఆలోచనల్లో బావ మెదిలి, బావ లేని జీవితం నిరర్థకమనిపిస్తోంది

కానీ కానీ ఆత్మహత్య చేసుకునేంత ధైర్యం తనకుందా? భగవంతుడు ప్రసాదించిన జీవితాన్ని మధ్యలోనే అంతం చేసుకొనే హక్కు తన కెక్కడిది?

నికృష్టంగా కాంతిమతి చేతుల్లో చస్తూ బ్రతకడంకంటే దుర్భరం మరొకటుందా?

అలాగని నీచమైన వ్యాపారం చేసే సూర్యంతో బ్రతుకంతా గడపటం తనవల్ల అయ్యే పనేనా? కానీ కానీ

అంతకంటే మార్గాంతరం కూడా లేదు అతను చెప్పిన మాటలు విని నిజమైతే అతని భార్యగా బ్రతకడమే ఉత్తమమైన మార్గం కానీ బావ? బావను మరచి బ్రతకగలదా? చిన్నప్పటినుండీ మనసులో మనసుగా మెసిలిన బావ ఎవరౌతాడు? తననొక వంచకిగా, మోసగత్తెగా, చిత్రించుకొని పిచ్చివాడౌతాడేమో! పోనీ తనమీద అసహ్యం పెంచుకుని మరో అమ్మాయిని పెళ్ళాడి సుఖంగావుంటే అప్పుడు మాత్రం తను భరించగలదా? తనెంత స్వార్థంగా ఆలోచిస్తోంది? తనకు దక్కని బావ మరింకెవ్వరికీ దక్కకూడదనుకోవడంలో యెంత స్వార్థం?!

"నిజమైన ప్రేమ త్యాగాన్ని కోరుతుందం టారు కానీ నిజమైన, పరిపూర్ణమైన ప్రేమలో స్వార్థంపాలే ఎక్కువగా వుంటుంది"

ఆలోచనల్లో తలక్రిందులవుతుండగానే తెల్లవారింది మల్లి ఆలోచనలుమట్టుకు తెగలేదు

[ఇంకా వుంది]

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

# లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా మీరు ఎదురు చూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోసం చూచే మీలాంటి వారి కోసమే యీ టీ. నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి. పూర్తిగా ఫాయిల్‌లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా, చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది.




LT/CAS-1/77R TEL

## సంతృప్తి నిచ్చే స్ట్రాంగ్ టీ

# కర్తవ్యం

పి.పద్మావతి




అసుర సంధ్యవేళ, పగలంతా సర్వ జీవరాశుల్ని తన వేడి కిరణాలతో గడ, గడ లాడించిన భాస్కరుడు, సంధ్యాదేవి పిలుపుకు చల్లబడి, ఆమె కురులల్లో తేలియాడసాగాడు పడమట అంతా రుధిర వర్ణంతో ఆకాశం శోభిస్తూంది పక్షులు గూళ్ళకి, మనుష్యులు తమ నివాసాలకి చేరుకుంటున్నారు. ప్రతి జీవికి ఒకే ఆశయం, అది తమ బిడ్డలకి మనసారా శ్రమించి, చమటోడిచి, బిడ్డలకు కడుపు నింపాలని అందులో, మనుష్యులకు, ఎంత రక్కసులయినా కడుపు శోకానికి వివశులయి దానివలన "ఇలా చేస్తే నా పాపకు మంచిదికాదే", "ఇలా చేస్తే నా బిడ్డకు పాపం చుట్టుకొంటుందేమో" అని ఒక్కోసారి తన పాప, పుణ్యాల పుటలని తిరగవేసుకొంటాడు

అమ్మా అని అరిచినా ఆలకించవేమమ్మ,
ఆవేదన తీరు రోజు ఈ జన్మకు లేదా . ..

ఘంటసాల రికార్డు నుండి వేదనాభరితంగా, మధురంగా, వినవస్తూంది కంఠం. పాట! శూన్యమనస్కంగా శూన్యంలోకి చూస్తూ ఆ పాటనే తన జీవితానికి పోల్చుకొంటున్న ప్రవీణకి పాప, బాబు వచ్చి తన కాళ్ళని చుట్టుకోగానే ఉలిక్కిపడి లేచింది ఐదేళ్ళ పాప,

ఆదేవిటమ్మ ఏడుస్తున్నావు అంది ప్రేమ ఉట్టిపడుతున్న స్వరంతో, ఆందోళన బాబు మాత్రం తల్లి కుచ్చెళ్లతో దాగుడుమూతలు ఆడుకొంటున్నాడు

"ఏంలేదమ్మా" అంటూ తన చిన్నారి పాపకి తనంటే కల్గిన ప్రేమాభిమానాలు, ఆ చిన్న గుండెలో తనపట్ల తనకన్నిటికి, ఆందోళన గమనించేసరికి ప్రవీణకు ఆనందమయినది మెల్లగా పాపను, బాబుని దగ్గరకు చేర్చుకొంది వీళ్ళు తన ప్రాణాలు తనని అనుక్షణం "మమ్మీ, మమ్మీ" అని కలవరించే ఈ పాపలు తన జీవన జ్యోతులు. తన రక్తమాంసాలు పుణికిపుచ్చుకుని, తన ఉనికిని ఈ లోకంలో తమ ద్వారా, తమ సంతానాన్ని ద్వారా, తన పేరుని శాశ్వతంగా చిరస్థాయిగా నిలుపుతారు ఈ భూమిపైన ఇంతకంటే సామాన్య గృహిణిగా, మాతృమూర్తిగా, స్త్రీగా, తన కింకేం కావాలి ముందు వర్తమానంలో, తాత్కాలికంగా తన బాధను మరిచిపోయిన ప్రవీణ ఎవరో ఛెళ్ళున వీపున చరిచినట్లుగా ఉలిక్కిపడింది లోనుంచి యెవరో అసహనంగా ప్రశ్నించారు.

నీ తల్లి నీ గురించి ఇలా యెన్నో ఆశలు అల్లుకుంది. చివరిరోజుల్లో, నీ నీడలో సేదతీరాలని ఆశించింది. తన రక్తాన్ని ధారపోసి, సౌభాగ్యాన్ని, సకల సంపదలని సమకూర్చింది. ఆ తల్లిపట్ల నీ కర్తవ్యాన్ని యెంతమాత్రం నిర్వర్తించగలిగావు. అంతరాత్మ ప్రశ్నలకి నిస్సహాయంగా, బేలగా రోదిస్తూ వుండిపోయింది ప్రవీణ.

"అమ్మగారూ!" లోనుంచి పని మనిషి లక్ష్మి పరుగు, పరుగున వచ్చింది.

"అమ్మా! ఈవేళ తమరు యెక్కడికో వెళ్ళాలన్నారుగా. ఉల్లి నూరి సిద్ధంచేసాను రండమ్మా, కుక్కర్‌లోకి పెట్టేసుకొందురుగాని" అంది.

మెల్లగా తేరుకొంది ప్రవీణ. ఔను వారు వచ్చేస్తే హడావుడి పెడతారు త్వరగా అన్నీ అయిపోవాలి అనుకొంటూ, పిల్లల్ని జాగ్రత్తగా ఆడుకోమని హెచ్చరించి, లక్ష్మిని అనుసరిస్తూ ఇంట్లోకి ప్రవేశించింది. గ్యాస్ అంటించి వంటలో నిమగ్నమయిన ప్రవీణకు వరండాలో సందడి వుంజాకునేసరికి, బయటకు వచ్చింది. అత్తగారు, మరిది, ఆడపడుచు కనిపించారు. 'రండి, రండి' అంటూ సాదరంగా వాళ్ళని పిలిచింది.

అత్తగారి ముఖంలో తనపట్ల తేలికభావం 'నా కొడుకు ఇంటికి నన్ను రమ్మనేటంతటి నెరజాణవా' అన్నట్లు నిరసన ఆడపడుచు ముఖంలో తనపట్ల అదోరకంగా నిర్లక్ష్యభావం ఇవన్నీ గమనించిన ప్రవీణకు ఒక్కసారిగా నీరసం ముంచుకువచ్చింది. మెల్లగా వాళ్ళకి కావల్సినవి అందిస్తూ వుండిపోయింది భర్త రాకకోసం ఎదురుచూస్తూ

"వదినా! అన్నీ కొన్నారుకాని డ్రస్సింగ్ టేబుల్ లేదేవిటి" అంది, ఆడపడుచు అన్నగారి ఇల్లు నలుమూలలా పరిశీలిస్తూ, కనులు అదోరకంగా తిప్పుతూ

"ఆఁ అది తెచ్చేసరికి దీని పిల్లలకి కాస్త పెళ్ళిళ్ళే అవుతాయి. ఇంతటి డాక్టర్‌కి ఈనాటి వరకు ఏ విలువైన సామాను పెట్టలేకపోయారు దీని పుట్టింటివాళ్ళు" అత్తగారి ఈసడింపు మాటలకి ఒక్కసారి భగ్గుమంది ప్రవీణ మనసు

"అత్తగారూ! మీ అబ్బాయి యింతటి డాక్టరు యెలా అయ్యారో తెలియదా? మీకు ఎన్నివేల ఖరీదులో ప్రాక్టీసు పెట్టించింది ఎవరో మరిచిపోయారా? మీ అబ్బాయికి కాకుండా మీకు, మీ సంసారానికి అన్ని లాంఛనాలతో పాటు మిమ్మల్నందర్నీ మా నాన్నగారు ఎలా తీర్చిదిద్దారో, మరిచిపోయారా" అనుకొంది మనసులో బాధగా

కోడలి ముఖం వివర్ణమవడం గమనించి అందుకొంది అత్తగారు మళ్ళీ

"చాల్లే! ఏమైనా అంటే ఏడుపుముఖం పెడతావు వచ్చిన ఇంట్లో అలా ఏడుపుముఖం పెట్టకూడదంటారు" అంది, ఈసడింపుగా

# కర్తవ్యం

ఎవరో "డాక్టరుగారు వున్నారా ?" అంటూ రావడంతో భారంగా ఆ దిశగా అడుగులు వేసింది ప్రవీణ. "ఏం మనుషులు వీళ్ళు ? యెంతసేపు పెట్టుపోతలుతప్ప యెదుటివాళ్ల మంచిచెడులు ఆలోచించే స్థితిలో వుండవా వీళ్ల ఆలోచనలు. అమ్మకి యెంతో సుస్తీ చేసిందని తెలిసి తను ఎలా కుమిలిపోతూంది. కనీసం మీ అమ్మ యెలా వున్నారు, అని అయినా అడగలేదు" అనుకొంది ప్రవీణ బాధగా.

రాత్రి తొమ్మిది గంటలకు వచ్చాడు మోహన్. తల్లిని, చెల్లిని, తమ్ముణ్ణి ఆదరంగా పలకరించి అందరూ భోజనాలకు కూర్చున్నారు. మోహన్ ప్రవీణను బలవంతంగా కూర్చోబెట్టాడు. ప్రవీణ అన్యమనస్కంగా వుండడం గమనించాడు మోహన్. చెల్లి, తమ్ముడు ఏవో అన్నగార్కి తగని కబుర్లు చెప్పేస్తున్నారు. ప్రవీణనే గమనిస్తున్న మోహన్‌కి విసుగుపుట్టింది. ఛ, ఛ, ఎప్పుడూ ఏడుపు ముఖమేనా ! తను యెప్పుడూ ప్రవీణ ముఖంలో నవ్వునే చూడాలనుకొంటాడు. ప్రవీణ అందంగా, ఆనందంగా, చిరునవ్వులు వలకబోస్తూ వుండాలని తన ఆకాంక్ష. అత్తగారికి బాగాలేకపోయినంతమాత్రాన ఏం మునిగిపోయిందో తనకు అర్థంకాదు. ఏం, లోకంలో తనేనా తల్లిని, తండ్రిని, విడిచి అత్తవారింటికి రావడం. వట్టి సెంటిమెంటల్ ఫూల్! విసుక్కున్నాడు.

"ఒరె అన్నయ్యా, మీ పిల్లలకి పూర్తిగా వాళ్ల పోలికలేరా, మన పోలికలు రావేలేదుకదూ" అంది ఆడపడుచు ఎగతాళిగా, ఎక్కసెక్కంగా బియ్యే చదువుతున్న తన పుత్రిక అధికప్రసంగ చాతుర్యానికి మురిసిపోతూంది అత్తగారు

తన రక్తం పంచుకొని పుట్టినందుకు తనని యెంతో ఆదరణగా, చెల్లికోసం, తమ్ముడికోసం ఉన్నత సోపానాలను నిర్మించాలని, కలలుకనే తన అన్నగారి ముద్దు సంతానాన్ని అనవలసిన బియ్యే చదువుతూ, నాగరికత, జలతారు పరదా కప్పుకున్న నవీన కన్య అనవల్సిన మాటలు ఇవా ? ప్రవీణ మనసు విలవిలలాడింది. ఈ రోజులలో విద్య విజ్ఞానంకోసం ఉపయోగపడడంలేదు జీవనాధారంకోసం మాత్రమే

ఆరాత్రి పడుకోబోతుంటే అడిగాడు మోహన్ ప్రవీణని దగ్గరకు తీసుకొంటూ "సారీ వీణా ! ఈరోజు ఎంతో త్వరగా రావాలని, నిన్ను, పిల్లల్ని పిక్చర్‌కి తీసుకువెళ్లాలని యెంతో ఉబలాటపడ్డాను. కాని సరిగ్గా ఒక సీరియస్ కేస్ రావడంతో ఆగిపోవలసివచ్చింది" అన్నాడు.

తరువాత నాలుగురోజులు అత్తగారి దెప్పుళ్ళు, ఆడపడుచు ఎగతాళి మాటలు, మరిది నిర్లక్ష్య ధోరణిని సహనంగా భరిస్తూ వాళ్ళకి కావల్సినవిధంగా నడుచుకుంటూంది. తరువాత కొడుక్కి వివిధ రకాలుగా జాగ్రత్తలు చూచిస్తూ తమ ఖర్చులు యెలా పెరిగిపోతున్నాయో ఏకరువుపెట్టి ఇంకా ఎక్కువ డబ్బు పంపించాలని కోరుతూ సెలవుతీసుకొని వెళ్లిపోయారు. భారంగా నిట్టూర్చింది ప్రవీణ.

ఆడపడుచు మరదుల చదువువల్ల ఈ పల్లెటూరులో కుదరదని అత్తగారు వాళ్లు పట్నంలో వుంటున్నారు. ఈ చుట్టుపట్ల పల్లెల్లో మరెక్కడా ఆసుపత్రులు లేక రాబడికోసం నాన్నగారు యెన్నో కష్టనిష్టూరాలు భరించి ఇక్కడ ప్రాక్టీసు పెట్టించారు. అందువల్ల తను ఈమాత్రం సుఖానికి అయినా నోచుకోకలుగుతూంది. అంటే తన భర్త అన్ని వ్యసనాలతో భార్యను హింసిస్తాడనికాదు ఎందరో ఊహిస్తున్న ఉత్తముడుగా తనని చాలా బాగా ఆదరంగానే చూస్తాడు. అదేం పాపమో మరి తనకి ఆ స్వార్థం అంటే చాలా అసహ్యంగా వుంటుంది. అతనికి తనే తప్ప తనని రక్తమాంసాలు పణంగాపెట్టి తమ సర్వదాస్తిని అతనికి ధారపోసిన అత్తమామలంటే కృతజ్ఞత లేదు మొన్న అమ్మకి చాలా సుస్తీపడిందని తెలిసి తను వెళితే ఆ రెండురోజులు అమ్మ దగ్గరుండి తను అన్నీ చేస్తూ తనకి జన్మ యిచ్చిన తల్లికి కొద్దిరోజులుగా దగ్గరుండి సేవ చేయాలని. యెంతో ఆశించింది అలా వీల్లేదని తనతో వస్తేనే, ఈ యింట్లో స్థాన ముంటుందని, లేకుంటే మళ్లీ ఇంటిగడప తొక్కద్దని యెంత నిర్దయంగా చెప్పగలిగారు. తను ఏడుస్తూ కుమిలిపోతూ వచ్చేసింది. ఆడపిల్ల




సమస్య వరకట్నానిదే కాదు. ఎన్ని శ్రమల కోర్చి వున్న ఆస్తిని హారతిలా కరిగించి అల్లుడ్ని తేవడంతోనే సరిపోదు. దిక్కు మొక్కు లేని అనాధల్లా చివరి క్షణాల్లో అంతిమ వూపిరి బరువుగా విడుస్తారు. ఎక్కడుంది ధర్మం ? వరకట్నం పాపం, పాపం అని ఎలుగెత్తి అరుస్తున్న ఈ సమాజంలో తరువాత ఈ బాధలు తీర్చేదెవ్వరు ? వరుడు భరించేవాడు కాబట్టి తమకున్న దానిలో సగర్వంగా తమ వధువుని ధారపోయడం, దానితో లాంఛనం పేరుతో కొద్ది బహుమతులని ఇవ్వడం ఆచారంగా పరిగణించబడింది. అలా వెళ్లిన స్త్రీకి భర్త ప్రత్యక్షదైవం అవడంలో ఆశ్చర్యంలేదు ఆనాటి స్త్రీకి కాని ఈనాటి స్త్రీకి వేట, లక్షలకొద్ది కట్నకానుకలతో పాటు ఇల్లు, ఇల్లుతోపాటు ఇంట్లో ఫర్నీచరు, వండుకునే పొయ్యి దగ్గర్నుంచి పాత్రలు వరకు, తినే సరకులు కూడా తను తెచ్చినదే, పైగా తన తల్లి, తండ్రులంటే నిర్లక్ష్యభావం, ఏ స్త్రీ అయినా ఇవన్నీ యెలా భరించగలుగుతుంది ? అందరు ఆడవాళ్లు ఎందుకంత ఆనందంగా వుండగలుగుతారు ? తనకి ఏమిటి ఇంత పిచ్చి ఆలోచనలు లేక వాళ్లందరిలోనూ మావాళ్ల కున్నంత లాంఛనాల పిశాచి వాళ్ళల్లో వుండక పోవచ్చు. ఆవేదనగా కణతలు రుద్దుకుంటున్న ప్రవీణ పని కుర్రాడు పిలుపుకి ఉలిక్కిపడుతూ చూసింది.

"అమ్మగారు ఇదిగో ఉత్తరం ఇప్పుడే పోస్ట్‌మాన్ ఇచ్చాడు" అంటూ ఒక ఇన్‌లాండ్ కవరు యిచ్చి, తన పని చూసుకోవడానికి వెళ్లిపోయాడు.

ఆందోళనగా అనుమానస్పదంగా కవరుని విప్పింది. దానిమీద పరిచయమైన అక్షరాలు కనిపించగానే గబా, గబా చదవసాగింది ఉత్తరాన్ని

చి॥ సౌభాగ్యవతి ప్రవీణకు,

సకల ఆశీస్సులతో మీ పిన్ని లక్ష్మీదేవి వ్రాయునది అక్కడ నీవు, పిల్లలు, అల్లుడుగారు క్షేమమని తలుస్తున్నాము నేను మీ బాబయ్యగారు వచ్చి 10 రోజులు కావస్తూన్నది అక్కయ్యకు బాగాలేని కారణంచేత మీ చిన్నాన్నగారు సెలవుపెట్టి వచ్చారు వీణా ! తమ సంతానంపట్ల కన్నవారు, ఎన్నో ఊహాసౌధాలు నిర్మించుకొంటారు ఆ పిల్లల సుఖసంతోషాలకోసం, తమ జీవితాన్ని హారతిగా వెలిగిస్తారు వీణా ! ఆ పిల్లలు పెరిగి తమ చివరి క్షణాల్లో తులసితీర్థం పోస్తారనయినా కావచ్చు. మరే స్వార్థం అయినా కావచ్చు. కాని వీణా ! పిల్లల్ని తాకుతున్న అనుభూతికి లోనైనా ఆ మాతృ పితృమూర్తులకు ఇవేవి గుర్తుకురావు తమ హృదయ స్పందనలోని సన్నజాజి పరిమళానికి వివశులవుతారే తప్ప, అందులో మరే స్వార్థం వుండదు. ఇందులో ఆ తల్లితండ్రులు పిల్లలవల్ల కలిగే భావస్పందనలో ఆడపిల్ల, మగబిడ్డ అనే తారతమ్యం కనిపించదు అటువంటి తల్లితండ్రులు యెడ పిల్లలు తమ కర్తవ్యాన్ని యెంతవరకు నిర్వర్తించగలుగుతారు ? అమ్మా వీణా ! మీరు ఈ కాలంవాళ్ళు. యెంతో విజ్ఞాన దీపికలను వెలిగిస్తున్నారు మీ మేధస్సులోని పదును దిగంతాల వరకు వెళుతూన్నది. అయినా ఏం లాభం, స్వధర్మాన్ని కాలరాస్తున్నారు వీణా, కోపగించకు తల్లీ ! ఇదంతా యెందుకు రాస్తున్నాను అంటే మీ అమ్మకు ఏం బాగాలేదు. అనుక్షణం నిన్నే తలుచుకొంటున్నది. ఇలా రాస్తున్నానని అక్కకు తెలియదు. నువ్వొక్కతివే కదా వాళ్లకు నేను కష్టపడుతూ ఇంకో నాలుగు రోజులు వుండగలను కాని ఎన్నాళ్ళు నా భర్త, నా సంసారం, తరువాత పనివాళ్లు వుండమ్మ కాని వీణా ! నీ తల్లి అంతిమ ఘడియల్లో తన కలలుపంట నువ్వు, నీ సంతానాన్ని కోరుకుంటున్నది. వీణా ! కంగారుపడవల్సినదేంలేదు. అమ్మకు మరేం ఫరవాలేదు. కాని నీ సన్నిధిలో మాత్రం ఆ తల్లికి వేయి ఏనుగుల బలాన్ని ఇస్తూంది. అందుకే ఇంతలా రాస్తున్నాను రావడానికి ప్రయత్నిస్తావని...

ఆశిస్తూ,
పిన్ని లక్ష్మీదేవి.

అందులో వున్న అక్షరాలు తనని శూలాలుగా పొడుస్తుంటే ముఖంమీద చేతులు కప్పుకొని రోదించసాగింది ప్రవీణ తనేం చెయ్యగలదు నువ్వు ఏం చెయ్యలేవా? గేలి చేసింది అంతరాత్మ ఎందుకు చెయ్యలేవు నీ చదువు, సంస్కారం ఏమి అయినాయి ? ఎప్పుడూ నీ సంసారం నీ సుఖం అని తలపోస్తే నీ కన్నతల్లి పట్ల

**తొక్క వొలిచిన ఉల్లాసం**




నారింజ రుచిగల

**బ్రిటానియా డిలైట్** కరకరల కమ్మదనం నింపుకొన్న బిస్కట్



నీ కర్తవ్యాన్ని నెరవేర్చలేకపోతే, నీ జన్మ దేనికి? ఔను ఆలస్యం భరించలేదు వెళ్ళాలి, ఆయన రాగానే.

కాని వారు మళ్ళీ ఈ గుమ్మం తొక్కవద్దంటారు అయినాసరే తన నిర్ణయం అనునయంగా చెప్పాలి. దీనికి అత్తగారు వాళ్ళు కూడా చాలా గొడవ లేవదీస్తారు అయినా తప్పదు, అనుకుంటూ బట్టలు బాగ్‌లో సర్దుతుంటే పాప ఆరు మైళ్ళ దూరంలో కాన్వెంటు నుంచి రోజూ జట్కా మీద వస్తుంటుంది పాప వచ్చేసింది పిల్లలిద్దరకు ముస్తాబు పూర్తిచేసి తనూ సిద్ధం కాసాగింది సరిగ్గా రాత్రి ఏడు గంటలకు వుంది విజయవాడ వెళ్ళే బస్సు

"అమ్మగారు ఇరుగో తీసుకువచ్చాను" అంటూ వచ్చాడు పని కుర్రాడు పక్కింటి వాళ్ళ అబ్బాయిని చూపించి.

"ఏమిటి ఆంటీ! పిల్చారా" అడిగాడు ఆ కుర్రాడు ప్రవీణను.

"అవును బాబూ! నేను విజయవాడ వెళ్ళాలి, అర్జంటుగా నువ్వు తోడు రాగలవా?" అడిగింది.

అందుకు ఆ అబ్బాయి "అలాగే వస్తాను ఆంటీ! అయితే మీరు రెడీ అయి వుండండి నేను మా అమ్మవాళ్ళకి చెప్పి వచ్చేస్తాను" అంటూ ఆ కుర్రాడు వెళ్ళిపోయాడు

"అమ్మగారూ, అమ్మగారూ, అయ్యగారు వచ్చారు." నెమ్మదిగా వచ్చి చెప్పాడు పనికుర్రవాడు ఒక్కసారి గుండె దడ దడ లాడింది ప్రవీణకు

మోహన్ డ్రస్సు మార్చుకుని కాఫీ తీసుకొనే వరకు ఊరుకొని తరువాత ఉత్తరం అందించింది అది తీసుకొని చదివిన మోహన్ ఆలోచిస్తూ కాసేపటికి చికాగ్గా,

"ఇది నాకు ఇచ్చావేమిటి?" అన్నాడు భార్య వంక చూస్తూ భర్తవంక పరిశీలనగా చూచి, "మా అమ్మకు మీరంటే ప్రాణం మీరు వెళ్ళకపోతే నన్ను అయినా పంపండి నాకోసం కలవరిస్తున్నది" ప్రవీణ కంఠం వణికింది

"దానికేం అలాగే వెళ్ళు" హేళనగా ధ్వనించింది మోహన్ స్వరం. "మళ్ళీ రెండు రోజుల్లో వచ్చేయాలి, లేకుంటే వీల్లేదు." కఠినంగా, అధికార దర్పంగా పలుకుతున్న అతని తీరుకి, అంతవరకు ఆడసహజమైన అణుకువను తెచ్చుకొన్న ప్రవీణ అతని తీరుకు సహనం నశించగా,

'కాదు ఒక నెలా, రెండు నెలలయినా అమ్మకి మనసారా తృప్తి కలిగించేలా వుండి వస్తాను" అంది.

"ఓహో! అన్నాళ్ళు వుంటావా అయితే ఇక్కడకు రానవసరంలేదు రెండు రోజులయితేనే వెళ్ళు" ఆజ్ఞలా వున్న అతని ధోరణికి, స్థిరంగా,

"ఫరవాలేదు, ఇన్నాళ్ళ పిచ్చిగా నా కాపురం అంటూ ఆగిపోయాను ఇన్నాళ్ళు తీర్చిదిద్ది తమ సర్వదాస్తిని నాకు ధారపోసిన నా తల్లితండ్రుల కోసం, నేను వెళ్ళక తప్పదు." ప్రవీణ మాటలకు ఆశ్చర్యంగా చూశాడు మోహన్. అంతలోనే అతని ముఖం అరుణిమ దాల్చింది

# కర్తవ్యం

"మాటలు నేర్చావు వెళ్ళు. నెల కాదు ఎలా, ఎన్నాళ్ళు వుండగలవో? అలనాడు సీత రాముని వెంట అరణ్యాలకు వెళ్ళింది అతని కంఠంలో హేళన సుళ్ళు తిరగసాగింది ఇప్పుడు స్త్రీలు భర్తతో అమెరికా తప్ప, అతని బాధ్యతలో నూరో వంతైనా పంచుకోరు. భేష్! చాలా బావుంది"

"ఔను; ఆనాడు, ఆ సీతకి ఆ రాముడే సర్వదాస్తి పుట్టింటివారి దగ్గర మంచి పుట్టింటి వారి ఘనతకు తగ్గట్టుగా కానుకలు తెచ్చుకొంది ఎప్పుడూ ఆవిడ పుట్టింటివాళ్ళని ఆవిడ భర్త దేనిని యాచించలేదు అందుకే సీత, రాముని వెంట అరణ్యాలకి పరమసంతోషంగా వెళ్ళగలిగింది కాని ఈనాడు, అన్ని దానాలలో కన్యాదానం గొప్పదనికదూ అంటారు. అటువంటిది కన్యతోపాటు అత్తవారిని దోచుకొని భార్యని అధికారంగా ఆజ్ఞాపించే భర్తలు కనుకనే వాళ్ళు మీ వెంట అరణ్యాలకు రాలేరు"

ప్రవీణ మాటలకు మండిపడుతూ అగ్నిజ్వాలల్ని కురిపిస్తూ, "వీణా! వెళితే నువ్వు వెళ్ళు పిల్లలు రారు" మోహన్ మాటలకి

**రచయితలకు మనవి**

స్థానికంగా వున్న రచయితలు కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచనలు అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం — సం

నిలువెల్లా వణికిపోయింది ప్రవీణ ఎందుకని బేలగా అడుగుతున్న ప్రవీణను చూసి "వాళ్ళు నా పిల్లలు గనుక."

మోహన్ జవాబుకి అతనివంక పరిశీలనగా చూస్తూ వాళ్ళు "నా పిల్లలుకూడా" అంది ప్రవీణ

ప్రవీణ కళ్ళలోకి చూచి "పాపకి చదువు పాడవుతుంది తీసుకునెళితే బాబుని తీసుకు వెళ్ళు" ఏదో దానం చేస్తున్నట్టుగా చూస్తూ, భార్యలోని మాతృత్వంలోని సంఘర్షణను రేపుతూ కర్కశంగా బయటికి వెళ్ళిపోయాడు మోహన్

విలవిలలాడిపోయింది ప్రవీణలోని మాతృత్వం, మమకారం రాయిలా బిగిసిపోయిన ప్రవీణ చైతన్యాన్ని కోల్పోయినదానిలా అయిపోయింది.

"ఆంటీ, ఇంకా తయారుకాలా! టైము ఎంతయిందో తెలుసా! ఇప్పుడు వెళ్ళకపోతే మనం బస్సును అందుకోలేం" అన్నాడు కంగారుగా వస్తూ పక్కింటివాళ్ళ అబ్బాయి

ఉలిక్కిపడుతూ చూచింది అతనివంక కదలిపోతున్న హృదయాన్ని చిక్కబట్టుకుంటూ రాయిలా చూస్తున్న ప్రవీణను ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు ఆ కుర్రాడు ఏమనాలో తెలియక. చాలాసేపటికి మెల్లగా,

ఆంటీ అని పిల్చాడు మరల తేరుకున్న ప్రవీణకి దుఃఖం ముంచెత్తసాగింది నా చిట్టి తల్లిని విడిచి బ్రతకడమా అని మనసు రోదించసాగింది మళ్ళీ అంతలోనే రోషం పెనవేసుకొంది వెళ్ళితీరాలి అనుకుంటూ పనికుర్రాడిని పిల్చి పాపని ఆటలకు తీసుకొని వెళ్ళమని, తను బాబుతో సహా, పనికుర్రాడు పాపని మభ్యపరిచి తీసుకు వెళ్ళిపోయాక, పక్కింటివాళ్ళ అబ్బాయి రిక్షా పిలవగా, జాలు వారుతున్న కన్నీటిని తుడుచుకొంటూ, బాబుతోసహా ఎక్కేసింది ప్రవీణ

"బస్సుస్టాప్ వచ్చింది, దిగండి ఆంటీ" చెప్పాడు కుర్రాడు

మెల్లగా దిగింది ప్రవీణ అక్కడ వున్నవాళ్ళు చెప్పారు ఇప్పుడే విజయవాడ బస్సు వెళ్ళిపోయిందని ఆసలే శక్తి నశించిన ప్రవీణకు, తను వెళుతున్న మార్గం చీకటి అవుతున్నట్లు భావన కళ్ళు చీకట్లు కమ్మసాగాయి వళ్ళంతా నీరసం ఆవహించగా అతికష్టంమీద నిగ్రహించుకుంటూ కనులు మూసుకొంది

"మమ్మీ, మమ్మీ!" ఎక్కడనుంచో పిలుపు ప్రవీణకు దుఃఖం పొర్లుకురాసాగింది

"వీణా!"

మృదుగంభీరమయిన ఆ కంఠం ప్రవీణకు ఎంత దూరాన వున్నా విన్పిస్తుంది తనని రెండు బలమయిన చేతులు తట్టి పిలుస్తుంటే కనులు తెరిచింది కంగారుగా ప్రవీణ ఎదురుగా మోహన్, పక్కన పాప సంభ్రమాశ్చర్యాలతో చూడసాగింది ప్రవీణ ఎందుకు అన్నట్లు చూస్తున్న ప్రవీణ కళ్ళల్లోకి చూస్తూ,

"వీణా, పాప నేను కూడా వస్తాం ఇదిగో టాక్సీ తీసుకువచ్చాను" అన్నాడు మోహన్ అక్కడ ఆగివున్న టాక్సీని చూపిస్తూ. ఇంకా సందేహంగా చూస్తున్న ప్రవీణతో, "నువ్వు, బాబు అత్తయ్యకి బాగా తేలిక అయ్యేవరకు వుండచ్చు నేను, పాప అప్పుడప్పుడు వచ్చి చూస్తుంటాం" అన్నాడు

"అంకుల్, అయితే నేను వెళ్ళివస్తానుమరి" అన్నాడు, ఆ కుర్రాడు

"ఆఁ మంచిది బాబూ వెళ్ళిరా నిన్ను శ్రమపెట్టాం" అన్నారు మోహన్, ప్రవీణలు

"ఫర్వాలేదండి" అంటూ సెలవు తీసుకొని నిష్క్రమించాడు ఆ కుర్రాడు

"ఏమండీ. మిమ్మల్ని చాలా మాటలు అన్నానుకదూ!" బాధగా అడుగుతున్న ప్రవీణను చూస్తూ,

"వీణా, నువ్వన్నది అక్షరాలా నిజం ఇన్నాళ్ళు అల్లుడిగా అహాన్ని చూపించానేగాని వాళ్ళ కష్టంలో భాగం పంచుకోలేకపోయాను ఇకనుంచి నావాళ్ళు, నీవాళ్ళు అని భేదం లేదు ఇరుపక్కల వాళ్ళు మనని కని పెంచి, ప్రయోజకులను చేసిన వాళ్ళే వాళ్ళ పట్ల మనం నిర్వర్తించాల్సిన కర్తవ్యాన్ని మరవకూడదు" అన్నాడు, టాక్సీ వేపుగా అడుగులువేస్తూ ఇద్దరు పిల్లలతో మనసెరిగిన భర్తగా బాధ్యత వహిస్తూ, అడుగులు వేస్తున్న భర్తను సంతోషంగా అనుసరించింది ప్రవీణ



'బొమ్మల కొలువు'లో కవిత

## దశ తిరిగిందిలో తిరిగిన మలుపు

గోపీ పాత్రలో మురళీమోహన్, సుందరం పాత్రలో చంద్రమోహన్ కెమెరా ఎదుట సిద్ధంగా నిలుచొని వున్నారు డైరెక్టర్ కట్టా సుబ్బారావు 'స్టార్ట్ !'' అంటూ కెమెరా చలనానికి ఆదేశ మివ్వగానే–

''శోభ నీకేమవుతుంది ?'' అన్నాడు సుందరం

''చెల్లెల్లాంటిది,'' జవాబిచ్చాడు గోపీ

''చెల్లెల్లాంటిది కాదు, స్వయానా నీ తోబుట్టువు అవును మీరిద్దరూ కవలపిల్లలు ''

''సుందరం ! ఏమిటి నువ్వు అనేది ?''

''నేను చెప్పేది అక్షరాలా నిజం ''

''నా పుట్టుకలో ఇంత రహస్యం వుందని, నా వెనుకే ఇంత కథ వుందని నేనెన్నడూ ఊహించలేకపోయాను కన్నతల్లి దగ్గర్లో వుంటూ,

## సినిమా

'అమ్మగారూ' అని పిలవడమే తప్ప నోరారా 'అమ్మా !' అని పిలుచుకోలేకపోయాను ''

''గోపీ ! నువ్విప్పుడు లక్షలకు వారసుడివి ఒక పేదవాడుగా – పాలవాడుగా బతకాల్సిన అవసరం నీకు లేదు పద వెంటనే ఈ విషయం కన్నవారికి, ప్రపంచానికి కూడా తెలియజేద్దాం ''

''సుందరం ! తొందరపడకు ఈ విషయం బయటపడకూడదు ఆస్తికోసమే బతుకుతున్న ఆ దుర్మార్గుడు ఆనంద్ ఎవరికైనా అపకారం తలపెట్టొచ్చు ఎంత దారుణమైనా చేయొచ్చు అవకాశం చూసుకొని ఈ విషయం నేనే బయట పెడతాను అంతవరకు ఈ రహస్యం తెలియనీయ కూడదు అలా అని నాకు మాటివ్వు ''

షాట్ 'ఓ–కే' అయ్యాక శోభ, ఆనంద్ పాత్రలు ఎవరు ధరిస్తున్నారని అడిగాను ''శోభగా జ్యోతి, ఆనంద్‌గా నూతన్‌ప్రసాద్ నటిస్తున్నారు మా చిత్రం కోసం నూతన్‌ప్రసాద్ విరామం, విశ్రాంతి లేకుండా రెండురోజులు ఏకబిగిన పని చేయడం మా అందరికీ ఎంతైనా ఆశ్చర్యం వేసింది మా చిత్రంలో మీరు కొత్త దీపను చూస్తారు రాధగా చాలా బాగా చేసిందామె,'' అన్నారు కట్టా సుబ్బారావు ఈ చిత్రంలోని పాటలను వినిపించిన నిర్మాత దగ్గుబాటి భాస్కరరావు 'నవంబర్ చివరి వారంలో విడుదల చేయాలనుకుంటున్నాం మా తదుపరి చిత్రంలో నాగేశ్వరరావుగారు హీరో కట్టా సుబ్బారావుగారే దర్శకులు,'' అన్నారు డైరెక్టర్ కట్టా సుబ్బారావు దశతిరిగినట్లే శోభన్‌బాబు హీరోగా విష్ణుప్రియా ప్రొడక్షన్స్ పతాకంలో జాగర్లమూడి రాధాకృష్ణ మూర్తి నిర్మించే ''కోడళ్ళు వస్తున్నారు జాగ్రత్త !'' చిత్రానికీ, కృష్ణ హీరోగా గోరంట్ల వీరయ్యచౌదరి, ఎస్ సుబ్బారావు నిర్మించే రాధాకృష్ణ మూవీస్ ''గయ్యాళి గంగమ్మ'' చిత్రానికీ దర్శకత్వం వెలిపబోతున్నారు

అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ వారి ''దశ తిరిగింది'' వర్ణాల చిత్రానికి సత్యానంద్ సంభాషణలకర్త సత్యం స్వరకల్పనలో వేటూరి, జాలాది, గోపి గీతాలు రాశారు ఎ వెంకట్ ఛాయ, సాయికుమార్ శిల్పం, మార్తాండ్ కూర్పు, సారిగ రామచంద్రరావు ప్రొడక్షన్ నిర్వహించారు ప్రొడక్షన్ కంట్రోలర్ పి శ్రీనివాస్

## ''ఇది బాలల ఏడాది''

—ఫొటో పి నరసింహారావు




BW. 7932 Tel



'శృంగార రాముడు'లో ఒక దృశ్యం

# సినిమా

## డైరెక్టర్ కె వాసు కొత్త చిత్రాలు

టి వి ఫిలిమ్స్ "నవంబర్ 16 న షూటింగ్ ప్రారంభమై, జనవరి 5 కి పూర్తవుతుంది. ఫిబ్రవరికి విడుదల చేస్తాం" అన్నారు నిర్మాత కె మహేంద్ర ఈ వన్నెల చిత్రంలో చిరంజీవి, నూతన్‌ప్రసాద్, కవిత, గిరిబాబు, హరిబాబు, ప్రసాద్‌బాబు ఇంతవరకు ఎన్నికయ్యారు జంధ్యాల రచయిత సత్యం సంగీత దర్శకుడు ఇదే సంస్థ కృష్ణ, జయప్రద, నూతన్‌ప్రసాద్‌లతో ఏప్రిల్ నెలలో మరో చిత్రాన్ని ప్రారంభించి జూలైకు పూర్తిచేస్తుంది

భారతీ ఆర్ట్ క్రియేషన్స్ "రాముడు — రంగడు" అనంతరం ఈ సంస్థ డిసెంబర్‌లో ప్రారంభించే చిత్రంలో కృష్ణంరాజు హీరో మార్చి మాసానికి చిత్రీకరణ పూర్తవుతుంది చక్రవర్తి సంగీత దర్శకుడు

ఇవి కాక, లోగడ కొంతవరకు తీసిన సొంత చిత్రం "గోపాలరావుగారమ్మాయి" ని పూర్తిగా కలర్‌లో చిత్రీకరించబోతున్నట్లు తెలిపారు డైరెక్టర్ వాసు ★



'కంచి కామాక్షి'లో శ్రీవిద్య

## చిలిపి వయసు

రాధిక, మీరా, సుధాకర్, ఎం రంగారావు, కాంతారావు, పద్మనాభం, రావికొండలరావు, రాధాకుమారి, సూర్యకాంతం నటించే "చిలిపి వయసు" వన్నెల చిత్రానికి మాటలు రాజశ్రీ, ఆయనతో కలిసి గీతాలు అప్పలాచార్య రాశారు శంకర్ — గణేశ్ సంగీతం, బాలు ఛాయ నిర్వహిస్తున్నారు సహనిర్మాత శ్రీమతి కె టి రమణి నిర్మాత శ్రీమతి పి విజయలక్ష్మి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ఎం ఎ ఖాజా

## సత్య చిత్ర 5 వ చిత్రం

కృష్ణ, జయప్రద జంటతో పి సాంబశివరావు దర్శకత్వంలో సత్యనారాయణ, సూర్యనారాయణ నిర్మించే వన్నెల చిత్రంలో సత్యనారాయణ నూతన్‌ప్రసాద్, చిరంజీవి, మోహన్‌బాబు సారథి ప్రభృతులు పాత్రధారులు తెర వెనుక ముళ్ళపూడి వెంకటరమణ, మహదేవన్, వేటూరి సుందరరామమూర్తి, పి ఎస్ ఆర్ స్వామి, ఎస్ కృష్ణారావు, కోటగిరి గోపాలరావు

## ఇరుగు - పొరుగు

★ అభిమానుల దగ్గర్నించి వచ్చే అసంఖ్యాక ఉత్తరాలకు జవాబు ఇవ్వడానికి, ఆటోగ్రాఫ్‌లు పంపడానికి ఒక సెక్రెటరీ చాలక ఇంకో సెక్రెటరీని కూడా ఇటీవలే నియమించాడు కమలహాసన్ పరమకుడి అనే ఊళ్ళో అడ్వకేట్‌గా ఉన్న కమలహాసన్ తండ్రి టి శ్రీనివాసన్ ఒకసారి తన కొడుక్కి ఉత్తరం రాస్తే, అది ఫలానావారి దగ్గర్నించి వచ్చిందని తెలియక — ఆ కవర్‌మీది అడ్రస్ చూసి ఆయనకు కూడా ఓ ఆటోగ్రాఫ్ పంపించేశాడట ఆ కొత్త సెక్రెటరీ

★ షూటింగ్ సమయాల్లో నిర్మాతల వద్దనుంచి ఏమీ ఆశించని కె ఆర్ విజయ అడిగి పుచ్చుకునే వస్తువు ఒక్కటే ఒక్కటుంది అది మల్లెపూలమాల కాగితంపూలు సిగలో పెట్టుకొని నటించడానికి ఆమె ఇచ్చగించదు

★ ఎంచేతో ఏమో - గాయని వాణీజయరాంకు మల్లెపువ్వులంటే బొత్తిగా గిట్టదట

★ శివాజీ గణేశన్‌కు భోజనంతోపాటు మామిడిపండు ఆరగించడమంటే ఎంతో ఇష్టం సీజన్ కాని సమయాల్లో డబ్బాల్లో నిల్వ ఉంచిన మామిడిపళ్ళను ఆయన భుజించడమూ కద్దు

★ మద్రాసు మౌంట్‌రోడ్‌లో ఉండే 'దర్గా' మసీదుకు జయమాలిని ప్రతి గురువారాలనాడు వెళ్తూంటుంది. ఆ మసీదుకు వెళ్లడంవల్లనే తనకు బాగా మార్కెట్ పెరిగిందని ఆమె విశ్వాసం

★ ఫటాఫట్ జయలక్ష్మి ప్రతి పౌర్ణమినాడు ఇంట్లో సత్యనారాయణవ్రతం చేయిస్తుంది ఆ సాయంత్రం పులిహోర, దద్ధోజనం వగైరాలతో తన స్నేహితురాండ్రను బీచ్‌కి తీసుకెళ్లి వెన్నెల్లో విందు ఇస్తూంటుందట

★ శ్రీదేవికి 'కేసెట్స్' సేకరించడమంటే ఎంతో సరదా "నాకూ, మా చెల్లాయికీ ఎప్పుడైనా పోట్లాటలు వస్తే ఈ కేసెట్స్ విషయంలోనే," అంటుందామె నవ్వుతూ

★ మద్రాసు 'సఫైర్' థియేటర్‌లో ప్రారంభించినది లగాయతు ఇంతవరకు ప్రదర్శించబడిన ప్రతి చిత్రం పేరు, అది ఆడిన వారాల సంఖ్య, వసూలు చేసిన మొత్తం, వినోదపు పన్ను కింద చెల్లించిన సొమ్ము వగైరా వివరాలన్నీ తెలిపే ఒక బోర్డ్ ఉంది "ది స్వార్మ్" 288 వ చిత్రం ఇంతవరకు అత్యధిక సొమ్ము వసూలు చేసిన చిత్రం "బ్లాక్ బెల్ట్ జోన్స్" ఎనిమిదిన్నర లక్షలు వసూలు చేసిందట



# వంటలు

## ఉసిరికాయల పొడి

కావలసినవి : ఉసిరికాయ ఒక కేజీ, తెల్ల ఉల్లి పావుకేజీ, జీలకర్ర 2 స్పూన్స్, ఎండుమిర్చి 50 గ్రా. నూనె పావుకేజీ, ఉప్పు తగినంత.

తయారుచేయు విధానం :— ఉసిరికాయలను మొదట గుండకొట్టి శుభ్రంగా కడిగి కరకరలాడేవరకు ఎండబెట్టాలి. తర్వాత తెల్ల ఉల్లి, మిర్చి, జీలకర్ర, ఉప్పుతోపాటు నూనెలో వేయించాలి వేగుతున్న సమయంలో ఎండిన ఉసిరికాయల్ని కూడా కళాయిలో పోసి ఎర్రగా వేయించి, దించుకోవాలి. కొంచెం చల్లబడ్డాక, అన్నిటినీ గుండకొట్టి సీసాలోకి ఎత్తుకుంటే బాగుంటుంది. ప్రసవించిన స్త్రీలు యిది తింటే మంచిది. ఇది నిల్వకూడా వుంటుంది.

— ఆర్. భామల్లిబాబు.

## కోకోనట్ బిస్కట్లు

కావలసిన వస్తువులు :— మైదాపిండి— ఒక కప్పు, డాల్డా—ఒక కప్పు, పాలు—ఒక కప్పు, ఎండు కొబ్బరి కోరు— ఒక కప్పు, పంచదార తగినంత, చిటికెడు సోడా.

తయారీ:— మైదాపిండిని బాగా జల్లించి దానిలో పాలు, కొబ్బరి కోరు, నెయ్యి, చక్కెర, సోడా వేసి పూరీ పిండి వలె తడపుకోవాలి. నీళ్ళు ఉపయోగించాలి. లేకపోతే చక్కెర కరగదు. కొంచెం పిండిని తీసుకుని పూరీలాగే పెద్దగా చేసుకుని కావలసిన ఆకృతిలో బిస్కట్ ముక్కలుగా ముక్కలు చేయాలి. ఇలా పిండివంతా చేసుకుని బాణలిలో నూనె పోసి వేడిచేసి తయారు చేసుకున్న బిస్కట్ ముక్కలను సన్నటి సెగపై దోరగా వేయించుకోవాలి. ఇవి తినడానికి చాలా రుచిగా వుంటాయి.

— శ్రీమతి వేంకట సుబ్బమ్మ.

# హైదరాబాద్ నోట్‌బుక్

— తిరుమల రామచంద్ర

## డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ :

విద్యాదదాతి వినయం — విద్యయొసగును వినయంబు అనే భర్తృహరి సూక్తి ప్రథమోదాహరణం డాక్టర్ భీమసేన్ నిర్మల్. హిందీవారికి తెలుగు సాహిత్య వైభవాన్ని చాటడానికి, హిందీసాహిత్యానికి తెలుగువారు చేసినసేవను వివరించడానికి, కంకణం కట్టుకొని వందలకొలది వ్యాసాలు, శతాధిక అనువాద, మౌలిక గ్రంథాలు రచించి, తెలుగును గురించి హిందీవారు ఏమి తెలుసుకోదలచినా నిర్మల్‌జీని అడుగుదాం అనే ధీమాను కలిగించిన కార్యశీలురు శ్రీ నిర్మల్. పూర్తి పేరు భండారం భీమసేన జోస్యులు. నిర్మల్ లేఖినీ నామధేయం. 1930 నవంబరు 30న మెదక్‌లో జన్మించారు.అక్కడే మిడిల్‌స్కూలు చదువు ముగించారు. హైస్కూలు చదువు గుంటూరులో మాతామహుల ఇంట్లో వుంటూ కొనసాగించారు. ఇంతలో రజాకార్ దుండగాల వల్ల హైదరాబాద్ వదలి గుంటూరులోనే వుండవలసి వచ్చింది. పై చదువులకు వెళ్ళే అవకాశం కలుగలేదు. చిన్నప్పుడు ఉరుదూ చదివారు గనుక, హిందీ అధ్యయనానికి పూనుకొని, హిందీ ప్రచారక్, రాష్ట్ర భాషాప్రవీణ అయ్యారు. రాజకీయంగా ఎన్నో మార్పులు వచ్చాయి. 1952లో హైదరాబాద్ పబ్లిక్ స్కూలులో [అప్పటి జాగీర్దార్ కాలేజి]లో హిందీ ఉపాధ్యాయులుగా చేరారు. ఇక స్వయం కృషి ప్రారంభమయింది. ప్రైవేటుగా ఇంటర్ బి.ఏ.లు 1958 లో హిందీ ఎం.ఏ., తెలుగు ఎం.ఏ.లు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులై 1960 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీశాఖలో ఉపన్యాసకులయ్యారు. మొదట వరంగల్లు కాలేజీలో పిదప హైదరాబాదుకు బదిలీఅయ్యారు. 1964 లో డాక్టరేట్ పొందారు. తెలుగుదేశంలోని తెలుగువారొకరు హిందీ నాటకాలు వ్రాశారు. ఆయన నాదెళ్ళ పురుషోత్తమకవి. పురుషోత్తమ కవికే హిందూస్తానీ నాటక్ అనే విషయం యీయన సిద్ధాంతవ్యాసం. దీనిని ఆయన తెలుగుభాషి హిందీ నాటకకార్ పురుషోత్తమకవి అనే పేర ప్రచురించి ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలతో పురస్కృతులయ్యారు. ఆయన మరొక మౌలిక ఉద్గ్రంథం తెలుగుఉపన్యాస సాహిత్య! ఇవి నేడు హిందీ వారికి ఉపజీవ్య గ్రంథాలుగా [రెఫరెన్సు]గా ఉన్నవి. హిందీవారికే కాదు, భాషా శాస్త్రజ్ఞులకు, నాటక చరిత్రకారులకు కూడా. తెలుగు కవులను కవి శ్రీ మాల పేరుతో, హిందీవారికి పరిచయంచేశారు. ఇటీవలవెలువడిన గొప్ప అనువాదం రంగనాథ రామాయణం. మూలం నాగరీ లిపిలో ఇస్తూ, మూలానుసారంగా మూలంలోని సంస్కృతపదాలు వాడుతూ అనువాదం సాగింది. హిందీ నుంచి తెలుగు అనువాదాలకు లెక్కలేదు. ఎన్నో సంపుటాలుగా వెలువడినవి. పత్రికలలో, ఆకాశవాణిలో హిందీ వ్యాసాలు, ప్రసంగాలు నాలుగైదు వందలకు మించి వుంటాయి. నిర్మల్‌కు పెక్కు సంస్థలతో సంబంధం వుంది. హిందీయేతర ప్రాంతాలవారి హిందీ రచనలను ప్రోత్సహించే దక్షిణాంచలీయ సాహిత్య సమితికి అధ్యక్షులు, సాహిత్యసమితి హిందీ సలహాసంఘం సభ్యులు, హిందీ ప్రచారసభసభ్యులు, పెక్కు హిందీ పత్రికల గౌరవ సంపాదకులు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ విభాగంలో రీడరు. ఇంతసేవ చేసిన డాక్టర్ నిర్మల్‌ను ఉత్తరప్రదేశ్‌లోని మధుర సాహిత్య కళాసంస్థాన్ సాహిత్యవారిధి. బిరుదంతో ఇటీవల [1979 అక్టోబర్ 2న] సత్కరించి తన ఉచితజ్ఞతను ప్రకటించుకొందే తప్ప మరేమీ కాదు.

## ఉద్యోగులకు పండుగ బహుమతి :

రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు దీపావళి బహుమతి ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి అన్నట్లు ఎన్నికల బహుమతి లభించింది.ఉద్యోగ విరమణ వయఃపరిమితిని 55 సంవత్సరాల నుంచి 58కి పెంచింది ప్రభుత్వం. ఆమధ్య నా మిత్రుడొకడు పిల్లలు చదువుతున్నారు, చేతికి అందిరాలేదు, వచ్చే ఏడు రిటయిరవుతున్నాను, ఏం గతి? అని వాపోయాడు. ఇంతలో ఈ ప్రకటన వెలువడింది. హమ్మయ్య అంటూ నిట్టూర్చాడు.కాని, ఒక విషయం మాత్రం గుర్తుంచుకోవాలి. ఇలాటిచర్యల వల్ల అధికారపక్షాలకువోట్లు పడతాయంటే, నమ్మరాదు దేనికదే. కేంద్రప్రభుత్వోద్యోగులకు ఇదివరకే వుందిగదా! ఇష్టమయిన వారికి ఎక్స్‌టెన్షన్‌లు వుండనేవున్నాయిగదా! కొత్తేమీకాదు— అనేవారున్నారు. ఎన్నేళ్ళీ ముసలాళ్ళు! అని యువకులలో అశాంతి ప్రబలకుండాప్రభుత్వం ఇతర ఉద్యోగావకాశాలు చూడాలి.

## తెలుగు తెలిసిన అధికారులు :

రాష్ట్రంలోని కేంద్ర ప్రభుత్వ సంస్థలలోని ఉన్నతోద్యోగాలకు అర్హులగల స్థానికులను నియమించక, ఇతర రాష్ట్రాలవారిని నియమించడం, ఆవిధంగా ద్వంద్వ పాలనను కొనసాగించి, తమ పెత్తనాన్ని పదిలపరచుకొనడం బ్రిటిషు పరిపాలకులు అనుసరించిన విధానం. దానిని స్వతంత్ర భరత ప్రభుత్వమూ పూర్తిగా పుణికి పుచ్చుకొన్నది. తెలుగుదేశంలోని ఏకేంద్ర సంస్థలోనైనా చూడండి. తెలుగువారు ముగ్గురుంటే గగనం. విశాఖ ఉక్కు కర్మాగారం విషయంలోను అంతే జరుగుతున్నది. మన రాష్ట్ర ప్రభుత్వ అభ్యర్థనలు, లేఖలు, మెమోరాండాలు, ఫిర్యాదులు పంపుతుంది, కేంద్రానికి. అనవి తరచు బుట్ట దాఖలవుతుంటాయి.ఏదో టెక్నికల్ విషయంలో, లా పాయింటుతో అవి కాలదోషం పట్టిపోతాయి. తెలుగువచ్చిన వాడినో, తెలుగువారినో నియమించాలని మనం అంటామను కోండి. దానికి చక్కని వ్యాఖ్య చేస్తారు, అధి

## గుహల్లో ఆసుపత్రులు

తెర్నోపోల్ సమీపంలోని బజర్నాయా (వరస్సు) గుహల్లో ప్రయోగాలు ముగిసాయి. ప్రయోగశాల వైద్యులు వ్లాడిమిర్ గొర్బెంకో, గుహల శాస్త్రీయ అధ్యయన వేత్త ఇగొర్ కురాంతోలు 30 మీటర్ల లోతులో ఒక నెలరోజులు గడిపారు. ఫలితంగా, శ్వాసకోశ, ఊపిరితిత్తుల, రక్తపుపోటు మొదలయిన వ్యాధులతో బాధపడే రోగులకు చికిత్స చేయడానికి గుహలు చాలా అనువుగా వుంటాయని వెల్లడైంది.

సోవియట్ యూనియన్‌లోని కాకసస్, మధ్య ఉరాల్స్ యింకా ఇతర ప్రాంతాలలో భూగర్భ ఆసుపత్రులు పనిచేస్తున్నాయి.

"ఆయన జేబులో ప్రెస్సు కార్డుంటుందిగా?" "అవును"

సరే స్వాల్ప నాస్తా త్వరగా మూసేందుకు తయారయేను - కానీ - పండితుల వారు అక్కడ తిరుగాడే ఫేషన్ పరేడును (నేను కూడా) చూసేసి ఆనక మా మీద "తిరుగుబాటు యువజనం" అంటూ దుమ్ము ఎత్తిపోస్తూ ఏ పేపర్లోనూ రాయరు కదా? నాకిది సంశయం!

ఓ గంటవరకు బిజినెస్ బురఖాలో దూరి, వచ్చేపోయే వారికి సమాధానాలిచ్చి, కావలసిన వారికి వివరాలిచ్చి విలాసార్థపేనం స్టాలు మూసేందుకు సామాను సర్దేసేం. ద్వారబంధంలో శ్రీవారి కంఠం ఖంగున మ్రోగుతూంది. మర్యాద పూర్వకంగా ఎదురు వెళ్ళేను. నేను అనుకున్నట్టు కవిగారు, పెద్దవారూత్సాహము తలపింప చేస్తున్నారు. మావారికి ఈయనెలా పరిచయమో కాని—మావారి ప్రేమకలా ధోరణి—పండితులవారి పక్కా కవిత్వానికి పొత్తెలా కుదురుతుందో?

వినయంగా తెలుగు భాషలో నమస్కరించిన నన్ను ఆశ్చర్యంగా చూస్తూ ప్రతి నమస్కారం చేసేరు, పండితులు.

మాట్లాడేందుకు వ్యవధి విన్వకుండా—డ్రాయరు సొరుగులాగి—ఫేషన్ షో పాసులు రెండులాక్కుని "చెరిచో గురాజీ"—

పి. వి. ఎ. కన్నా

కొందరు భగవంతుడు వున్నాడని, కొందరు లేడని వాదించుకొంటారు. లేడని వాదించే వారికి సమాధానం ఎలా చెప్పాలి ?

సింపుల్. ఎందుకు ఏ ఆధారా మీద ఆధారపడిలేడంటున్నారు ? అని ఎదురు ప్రశ్న వేయడమే.

వై. వి. కడప

మాకు వివాహమై 15 సంవత్సరాలైంది. సంతానంలేదు. ఇద్దరిలో ఏ లోపం లేదన్నారు. నా వయస్సు 42. రెండవ వివాహం చేసుకొనుటకు ఆమె అడ్డు చెప్పుటలేదు. నాకు మనస్కరించడంలేదు. మీ సలహా ఏమిటి ?

ఆసోసారి లేడీ డాక్టరుకి చూపెట్టండి. సాధారణంగా ఇతర(లా లోపం లేకుంటే చిన్న డి. ఎస్. సి. తో ఫలితం కన్పించవచ్చు. నేనలాంటి మహిళలని చాలా మందిని చూశాను. పాతిక సంవత్సరాల వైవాహిక జీవితం తరువాతకూడా సంతానవతులైన వారిని చూశాను. లేదంటారా సంతానం ఒక్కటేకాదు భార్యాభర్త అన్యోన్యతకి చిహ్నం. చక్కగా ఏ దిక్కూలేని పసికూనల్ని పెంచుకుని పిల్లల పెంపకంలోని ఆనందం చవి చూడటం కూడా మంచిదే. తల్లితండ్రుల ప్రేమకి నోచుకోని పసికందులు మనదేశంలో లక్షలాది ఉన్నారు. ఏ ఒక్కరికి ఆ ఆనందం మీ దంపతులు ఇవ్వగలిగినా, అంతకి మించిన గొప్పతనము వుండదని నా ఉద్దేశ్యం. దీన్లో కావలిస్తే రాయండి. నా సహాయం తప్పక ఉంటుంది.




వి.ఎస్. ఎ. ఎస్. కామారెడ్డి

అందమైన అమ్మాయికి, తెల్లకాగితానికి తేడా ఏమిటి ?

జీవం !

మగువలేని మగని బ్రతుకు దేవుడులేని దేవాలయం. మగువలేని మగ బ్రతుకు....

నీడలేని బ్రతుకేకద— లాజికల్‌గా అవ్వాలి. అలా అంటే గొప్పుకుంటారని తెగిన గాలిపటం అన్నారు.

కె. ఎస్ బి; కె. ఆర్. కె. మంగళగిరి

ఆకాశవాణి వివిధ భారతి వాణిజ్య ప్రసారం చిరునామా తెల్పండి.

కిట్టుబాటు కాని పబ్లిసిటీ పత్రికద్వారా అడగడం అన్యాయం ! మీరు రాసిన ప్రశ్నే చిరునామా, వూరుపేరు చేర్చండి చాలు.

బి.వి. ఆర్. వి.ఎన్. బళ్ళారి

ఆడవారు ప్రగతి సాధించారనడానికి గుర్తు ?

మీ మీ అక్క చెల్లెళ్ళలో, మీ తల్లి దృక్పథంలో తెలియకుండానే వచ్చేసిన మార్పులే గుర్తు.

ఎ. ఆర్. ఆర్ కలకత్తా

పెద్దలనోటినుండి వెలువడ్డ ఆశీర్వాదం ఫలిస్తుందంటారు. ఎంతవరకు నిజం ?

ఎంతో కొంత దీవిస్తే ! కాని మనని దీవిస్తూ మనస్సులో తిట్టుకుంటున్నారేమో— ఎలా తెలుస్తుంది ? అంచేత ఆశీర్వచన బలంతో వురుకోక— మన ప్రయత్నం జత చేసుకోడం నిజమవడానికి మంచిదారి.

వి.ఎస్. ఎల్ టయుపల్లి

మనిషి మంచితనాన్ని గుర్తించి అతను చేసిన సహాయానికి డబ్బులో విలువ కట్టడం న్యాయమా అన్యాయమా ?

మంచి మనిషికి డబ్బుండదు. సహాయం పొందిన వారికి—కృతజ్ఞత తెలుపుకోకపోతే తృప్తి వుండదు అంచేత డబ్బుతో విలువ కట్టలేని సహాయానికి— ఇవ్వబోయిన డబ్బు— సహాయం పొందినవాడి కృతజ్ఞతకి చిహ్నంగా మాత్రమే చూడాలి. అడిగి పనిచేసిపెడితే లంచం అవుతుంది. అడక్కుండా అభిమానంతో యిచ్చేది ఉడతాభక్తి.

## ఆధునిక కవి

అంటూ కవి వర్యులను బర బరా లాక్కు వెళ్ళి పోతున్నారు శ్రీవారు.

"దిక్కువచ్చి పోయేన్నేను — గోదావరి—కృష్ణా నదుల్లో సంధ్యావందనమార్చి — వృక్షమైన కవిత్వాలల్లే పండితుల్ని... కుర్రపిల్లలు అర్ధనగ్నంగా గుడ్డలు ధరించి వాటిని కూడా విప్పుతూ, స్టేజిమీద రంగు లైట్లలో — తమ అందంతోపాటు నగ్న ప్రదర్శనల్ని కూడా ప్రదర్శించే, ఫేషన్‌షోకి, భాగవతం ముటుకుంటి కవిగార్ని తీసుకు వెళ్ళటం నాకేం నచ్చలేదు. డిజైనరుగా నన్నెంత చులకన చేసుకుంటారోనన్న భయమేసి పరగున మావారిని చేరుకుని కవిగారికర్ధంకాని పంజాబీలో మందలించేను.

"విన్నాగా" గలగలా నవ్వేసి, కనుబొమలు ఎగరేసి, ఆయన్ని అచ్చంగా లాక్కుపోయారు స్టేజి దగ్గరకి ఇకనాకు ఫేషన్ షోకి వెళ్లే బుద్ధిపుట్టలేదు. కాక్‌టేల్ పార్టీ ప్రారంభించే టయిమవుతోంది. పరవీన్ చేతిలో మిగిలిన రెండు పాసులూ వుంచి, స్టాలు మూసేసి, పార్టీగ్రూప్‌లో ప్రవేశించేను. నాలాగే వచ్చినవారంతా గుంపులు కూడి వున్నారు. అందరూ మాటల్లో మునిగి వున్నారు.

సాఫ్టు డ్రింకులు హాట్ డ్రింకులూ చేతులు మారుతున్నాయి. ధన్యవాదాలు వినపడుతున్నాయి. నా చేతిలో వున్న లెమన్ జూస్ సగం కూడా తరగలేదు కొనుగోలుదారుతో వచ్చిన స్వీడిష్‌డిజైనరు ఇన్ టాపీ, ఇండియన్ హాన్‌బెండ్ గురించి వివరాలడుగుతూ విసిగిస్తుంది. నాదృష్టి గడియారం మీదేవుంది. నా అంచనా ప్రకారం మా వార్ని నాలుగు చివాట్లేసి కళ్ళు మూసుకుని ఫేషన్ పెరేడ్ నుంచి కవిగారు పలాయనం చేసి నా దగ్గరకి వస్తారని. కానీ అలా జరగలేదు. షో పూర్తిగా అయాక చంటాళ్ళలా కబుర్లు చెప్పుకుంటూ కాక్‌టేల్ పార్టీలో ప్రవేశించి, బేర రందించిన విస్కీ గ్లాసులు సిప్ చేస్తూ నా దగ్గరకొచ్చేసేరు. నా ప్రాణం కుదుటపడ్డది. కవిగారు కోపంగా లేరు.

"చాలా బాగుందమ్మలూ ! ఏం అందం ఏం లావణ్యం. ఓహోహో !" కవిగారి భాషణ యిది.

"ఏహోయ్ శిష్యుడా ! ఎయిర్ బస్సులో ముగ్గురేసి అప్సరాంగన లుంటారని ఆశపడి వస్తే ! వాళ్ళేం అందగత్తెలయ్యా, సిగరెట్ తాగిన పెదాలు రంగులేసి. అయినా ఈ కుర్రాళ్ళు చాలా అందంగా అచ్చంగా రాయంచల్లా నడుస్తూ, ఓహో ఏంహొయలూ..."

అర్ధమయింది నాకు. ప్లేగువ్లో దొరకని అందాలు మా మోడలమ్మాయిల్లో కవిగారు చూసేసేరు. నిజమే. ఎయిర్ హోస్టెస్ కేవలం ఉద్యోగినులు. ఈ అందాలు ప్రదర్శించే అతివలు గొప్పవారి ముద్దుబిడ్డలు. కేవలం గొప్పకోసమూ (డబ్బు కూడా) పేరుకోసం ప్రదర్శన లిస్తారు. అయినా పెద్దనామాత్యులంతటి వారే బంగారు మూసుటుయ్యాలలూ పే జివారాలంకపురంపువిడెము అందించే పడుచులు, వింజామరలు పట్టు పడతులు, పక్కన లేనిదే నవరసభరితమైన కవిత్వం రాయలేక పోయేరే. పాపం కవిగారికి ఇంత మాత్రపు ఉబలాటం సబబేగా. ఏమైనా ఆవకాయ జాడీ గురించి ఆలోచించే బాధ తప్పిందని సంతోషించేను.

కె. విన్ మంగళగిరి

ఇక్కడొక పి. హెచ్. డి. కట్నం ఇరవై ... వాడు పుంగరాలు మాటు బూటు .. ఇలాంటి వాళ్లని ఏం చెయ్యాలి ?

పౌరుషంగా వుంటే వదులుకోవాలి. ఈ రోజులలో పి. హెచ్. డి. గొప్పకాదు. ఎం. ఏ. వుంటే ఎవరైనా దేనిమీదనైనా చేసేయవచ్చు ! వాళ్లేళ్లి పాటు ఉద్యోగం వెదుక్కోవలసిన బాధ ఉండదు కదా అని ఇలా పరిశోధనకి దిగేవాళ్లని కూడా నేను ఎరుగుదును. ఇది కట్నం కాదా అంటారా? పెళ్లి చేసుకుంటే రెడీమేడుగా భార్య దొరుకుతుంది. మిగిలినవి సమకూర్చుడానికి ... కూడపెట్టి కనుక్కోవాలన్న పట్టుదల లేని వాళ్లు ... పెరకడానికి ప్రయత్నపడటంలో ఆశ్చర్య మేమి ?

---

## వారఫలం

23-11-1979 శుక్రవారం మొదలు
29-11-1979 గురువారం వరకు

**మేషం:—** శనిగ్రహం మీకు సకలరంగాలలో, అధికాదాయం సంక్రమింప చేస్తాడు. వ్యాపార దిగ్విజయంగా జరుగుతుంది. ఇటీవల మీరు గావించిన ప్రయత్నాలు, శ్రేయోదాయకమవుతాయి. ఉద్యోగం, వృత్తి, రచన, సంగీతాది విషయాలలో ప్రవేశమున్నవారికి ఉత్తమ ఫలప్రదాయకమైన వారం. కృషి చేయండి. స్త్రీలకు: ముఖ్యంగా విద్యావంతులకు అనేక అవకాశాలు రాగలవు.

**వృషభం:** కాలం సద్వినియోగం చేసికోండి. ఆరోగ్య లోపం కనిపించినా, గాడంగా కృషి చేసారంటే మీకు సమకూడని విషయమంటూ ఉండదు. చాలమందికి ఉద్యోగస్తులకు, ధనాదాయం, వృత్తిలో అభివృద్ధికరమైన వార్తలుంటాయనటానికి ఆక్షేపణలేదు. శత్రువర్గీయులతో పోరాటం ముగియగలదు. కొందరు మీ వెన్నంటి తిరుగుచూ, మోసం చేయదలచిన వారుంటారు. స్త్రీలకు: వృత్తి ఉద్యోగాభివృద్ధి, వస్త్రసేకరణ ఉంటుంది.

**మిధునం:—** మంచిగా ప్రవర్తించి, మిత్రబాంధవులతో ముఖ్య సంఘటనలను గూర్చి ముచ్చటించి లాభం గడించగలరు. ఒకానొక విషయంలో, మీకు ద్రవ్యాదాయం సంభవం. కటినంగా మాటలాడవలసిన గ్రహస్థితి ఉంటుంది. ఎంత శాంతంగా వ్యవహరిస్తే, అంత హాయిగా, ఆనందంగా మీ కార్యం నెరవేరుతుంది. స్త్రీలకు: ముఖ్యంగా కళాకారులకు నూతనావకాశాలుంటాయి. ఆదాయంలో అభివృద్ధి చెప్పవచ్చు.

**కర్కాటకం:—** ఏ కళలనైతే మీరు నమ్ముకుంటారో, ఏ లలితకళా ప్రావీణ్యత మీకు లభిస్తుందో, ఏ రచనా విధానం మీద మీకు ఉబలాటం ఉన్నదో, దానిలోనే మీకు ద్రవ్యాదాయం సంభవం. అనేకావకాశాలుంటాయి. వినియోగించుకొని లాభమార్జించండి. భూసంబంధమైన విషయాలలో, కొంత చికాకు కలుగవచ్చు, జాగ్రత్త. స్త్రీలకు: పత్రిక, చలనచిత్రరంగానుభవం గల వారికి అభివృద్ధి కలదు.

**సింహం:—** శరీరారోగ్యం బాగుంటుంది. కాని మానసికంగా, ఏదో ముఖ్య సంఘటనను గూర్చి రాత్రింబవళ్ళు ఆలోచిస్తారు. రాశికి రెండవ యింటనున్న శనిగ్రహం, ఏమాటి మేలు చేయడు సరిగదా, కొంత అపకారం కూడా ధన విషయంలో కనిపిస్తుంది. ఆదాయం ఆశించతగిన వారంగాదు. స్త్రీలకు గర్భకోశానికి సంబంధించిన వ్యాధి వయసుమీరినవారి విషయంలో చెప్పవచ్చు.

**కన్య:—** మీ సహనం, కార్యశూరత, మీకు మేలు చేకూర్చుతుంది. గృహ విషయంలో, సంతాన విషయంలో, ముఖ్యలావాదేవీలలో, వ్యాపారవిస్తరణలో

**ఆస్ప్రో రెట్టింపు వేగంతో బాధ నివారిస్తుంది.**
**నిజం! రెట్టింపు వేగంగా!**




మైక్రొఫైన్డ్ ఆస్ప్రో తలనొప్పి, ఒళ్ళు నొప్పులు, పళ్ళనొప్పులు, జలుబు మరియు ఫ్లూలనుండి ఉపశమనమునిస్తుంది.

**పెద్దవారికి మోతాదు 2 మాత్రలు**




**మైక్రొఫైన్డ్ ఆస్ప్రో**

Nicholas

**ఎందుకంటే ఆస్ప్రో ఒక్కటే మైక్రొఫైన్డ్ చేయబడింది.** Sista's-NIA-506A/77 Tel

---

**30 వేల మందికి పైగా మహిళామణులతో కళకళలాడే**

# మహిళాగ్రూప్ నెం2

మిమ్మల్ని లక్షాధికారిణిగా చేస్తుంది!
మీ పొదుపు 7 నెలలే!
మొత్తం రూ. 150/- మాత్రమే!



రూ.1,50,000/- నుండి రూ.10/- వరకూ 34 వేల బహుమతులకు పైగా!
"ఆలస్యం అమృతం విషం" అను ఆర్యోక్తి కాదనకండి!
ఇప్పుడే... త్వరగా...!

**గోదావరి సేవింగ్ సిండికేట్**

## ధర్మపథం

# ఉత్తమ వేషం

— బులుసు వెంకటరమణయ్య

శూర్పణఖ వల్ల సీతాదేవి సౌందర్యాన్ని గురించి విన్న రావణుడు వివాహితయినా ఆమెను స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నాలు ప్రారంభించాడు. మొదట మారీచుణ్ణి ప్రోత్సహించి, మాయ లేడిగా అతడు మారేటట్టు చేసి, అతని ప్రాణాలను బలిగొని, మోసం చేసి, సీతాదేవిని విమానంపై ఎక్కించుకొని లంకకు తీసుకు పోయాడు. ఆమె ఎప్పుడూ విచారంతో ఉండడం చూచి వన పరిసరాలే ఆమెకిష్టాలని తలచి, భవనంలో కాకుండా అశోకవనంలోనే ఆమె నివాసం ఏర్పాటు చేశాడు. ఎన్నో మంచి మాటలు చెప్పాడు చెప్పించాడు ఆమె స్వాధీనం కాలేదు. చంపుతానని బెదిరించాడు. దానికిన్నీ ఆమె అణుమాత్రమూ బెదరలేదు. తర్వాత అతడు మరో ఉపాయాన్ని ఆలోచించాడు.

తాను కామరూపుడు కాబట్టి ఏ రూపాన్నయినా ధరించవచ్చును. కనుక రాముని రూపాన్ని ధరిస్తే ఆమె తప్పకుండా—తామ రాముడే అని భ్రాంతిపడి లొంగగలదని ఆలోచన తట్టింది. వెంటనే అతడు శ్రీరాముని వేషాన్ని ధరించాడు. ఆ వేషాన్ని ధరించడంతోనే అతనిలోని అసుర గుణాలు పోయి, రామునిలో ఉండే ఉత్తమ గుణాలు చోటు చేసుకున్నాయి. మంచి ఆలోచనలు కలగసాగినవి. పర స్త్రీలను తల్లుల వలెను, సోదరీమణుల వలెను భావించాలనే దృఢ సంకల్పం ఏర్పడసాగింది. అతనికే ఆశ్చర్యం కలిగింది. "నేనెందుకీ వేషం వేసినట్టు? నా భావాలు మారిపోతే లాభం ఏమిటి? ఇది చాలా ప్రమాదకరంగా వున్నదే!" అని గ్రహించి అతడు ఆ వేషం వెయ్యడం మానివేసి, మామూలు రావణుడయ్యాడు. వెంటనే సహజసిద్ధమైన భావాలు అతనికి కలగసాగినవి.

నాటకంలో నటులు ఏ పాత్రను ధరించినా, ఆ పాత్రయొక్క గుణాలు కొంతవరకూ అలవడుతాయి. తాగుబోతు వేషధారికి తాగుబోతయినవాడే తగి ఉంటాడు. ఉత్తమ పాత్రను ధరించడానికి ఉత్తమ గుణాలు ఉన్నవాడే తగి ఉంటాడు. నీచగుణాలున్నవాడు ఉత్తమ పాత్రను నిర్వహిస్తే రాణించదు.

# అవీ...ఇవీ...అన్నీ

### రామాయణ తనిశ్లోకి

ద్రావిడ వ్యాఖ్యాత, శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై. ఆంధ్రానువాదము. శ్రీ చింకొటి వేంకటార్యానుజార్య 92 పేజీలు, వెల: 8 రూపాయలు. ప్రకాశకులు: శ్రీ గీతా గ్రంథమాల, మునుసూరు 521201, [కృష్ణాజిల్లా]

### ఇచట సన్మానాలు చేయబడును

స్త్రీ పాత్ర లేని హాస్య నాటిక. రచన. శ్రీ ఎన్. మునిసుందరం. 32 పేజీలు, వెల రెండు రూపాయలు. ప్రతులకు. విశ్వప్రభ పబ్లిషింగ్ హౌస్, వేంద్రగుంట, నెల్లూరు జిల్లా, లేదా దేశీ బుక్ హౌస్, 3-5-1089-3, నారాయణగూడ, హైదరాబాద్-29.

### ఆర్ ఎస్ ఎస్. రాజకీయ పక్షమా?

నవభారతి వారు ప్రచురించిన ఈ పుస్తకంలో శ్రీ దత్తోపంత్ ఠేంగ్డే, శ్రీ [illegible], శ్రీ కె ఆర్. మల్కానీల విశ్లేషణాత్మక వ్యాసాలు ఉన్నాయి. 24 పేజీలు గల ఈ పుస్తకం వెల ఒక రూపాయి.

### హిందూరాష్ట్ర మంటే ?

రచన. శ్రీ సత్యవాది, 32 పేజీలు, వెల రూపాయి. ప్రతులకు సాహిత్య నికేతన్, సంగ్రామ్ చౌక్, ఏలూరు రోడ్, విజయవాడ-2.

### గగనంలో నా తార

కవితా సంపుటి. రచన శ్రీ ఎస్ ఎస్.ఎస్ ఎస్.వి. రమణమూర్తిరాజా 66 పేజీలు, వెల రు 6 లు. ప్రతులకు. శ్రీ ఎస్ ఎస్ ఎస్.ఎం వి ఆర్. ఎం. రాజు, గుండాలవారి వీధి, విజయనగరం

### పుష్పవృష్టి

స్వప్రయోగ తెలుగు–ఇంగ్లీషు డిక్షనరీ (డీప్స్ కాలేజీ ప్రచురణ) 232 పేజీలు వెల 8 రూపాయలు ప్రతులకు : డీప్స్ కాలేజీ, నరసింహారావు పేట, ఏలూరు.

### మాటాడే మల్లెలు

కవితాసంపుటి రచన: శ్రీ [illegible] తిరుమల 88 పేజీలు, వెల 5 రూపాయలు ప్రతులకు: నవయుగ బుక్‌హౌస్, సుల్తాన్‌బజార్, హైదరాబాదు.

### ఊదారం ఎక్కడికి ?

నవల రచన శ్రీ మహీధర రామమోహనరావు 332 పేజీలు, వెల రు. 12 లు. ప్రతులకు: విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ—4



ఆంధ్రప్రదేశ్ క్రోక్వెట్ క్లబ్, విశాఖ విభాగం ప్రారంభం [15 ఆగస్టు 1979] లో సమావేశమైన కార్యనిర్వాహకులు శ్రీయుతులు 'ఆత్మాజి' 'గిరిశ' శ్రీ అర్జులనరసింహం (విశాఖ విభాగం గౌరవాధ్యక్షులు) మధ్యస్థానే లీలానంద్, సుధాకర్, ఓంకార్ తదితరులు ఛాయాచిత్రంలో వున్నారు.

# ఉత్తరాలు

## ముఖచిత్రం

2-11-79 నాటి ఆంధ్రపత్రిక (వీక్లీ) దీపావళి సంచిక శంకుగారి ముఖచిత్రం చాలా చక్కగా బ్రహ్మాండంగా ఉంది. కార్టూన్లు బాగున్నాయి. ఎప్పటికి ఇలాగే ముఖచిత్రాలలో వెరైటీ ఉండాలని ఆశిస్తాను.

వాసం రమేశ్ [వరదాం]

* * *

ముద్దుమందారం, మా అభిమాన తార కుమారి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన 19-10-79 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ప్రేమపాశం సీరియల్ పత్రికకే హైలైట్. హాస్యకథ చాలా బాగుంది.

ఎమ్. జగన్మోహనరావు పట్నాయక్ (విశాఖపట్నం)

* * *

అందాల నటి శ్రీదేవి ముఖచిత్రం మా మనసులను ఆకట్టుకొని క్షణంసేపు చూపులు మరల్చలేక పోయాను. ఈవారంతో ముగిసిన నళిని సీరియల్ అనుకోని మలుపు తిరిగి మమ్మల్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది. ప్రేమపాశం సీరియల్‌లో జానకి పాత్రను చూస్తే నిజ జీవితంలో అటువంటి త్యాగశీలురు ఉండరనిపిస్తుంది.

ఇందుముఖి. ఎస్. (సోమందేపల్లి)

* * *

26.10.79న వెలువడిన మా అభిమాన ఆంధ్ర సచిత్రవారపత్రిక దీపావళి సంచికపై పంచరంగుల నరకాసుర వధ ముఖచిత్రం చూడముచ్చటగానున్నది. ఈవారం నుండి ప్రచురింపబడినకొత్త సీరియల్ సుదూర తీరాలు క్రొత్తతరహాతో ప్రారంభించబడినది. ముందు ముందు మరింత ఉత్సాహపరచగలదని ఆశిస్తున్నాము.

దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన కథలు చాలా బాగా నచ్చినవి. మొత్తానికిదీపావళిసంచిక మాకు ఆనందింప జేసినది. అందులకు మీకు మా యొక్క హృదయపూర్వక కృతజ్ఞతలు. దీపావళి కార్టూనులు చాలానవ్వు తెప్పించినవి.

పి. ప్రతిమ, జయప్రద, రాజేశ్వరి, శశిబిందు, హిమబిందు, రాగిణి, జిన్ని (బరంపురం)

## సీరియల్

19-10-79 నాటి ఆంధ్ర సచిత్రవార పత్రికపై నున్న శ్రీదేవి ముఖచిత్రం మనోహరత్వంతో ఆకట్టుకున్నది. ప్రేమపాశం సీరియల్ పత్రికకే హైలైట్. నళిని సీరియల్ ముగింపు మాకు నచ్చలేదు. హాస్యకథ బాగానే వున్నది. సినిమా విశేషాలు ఈవారం బాగానే వున్నాయి. కార్టూన్స్ బాగున్నాయి..

ఎం. లలిత, కామేశ్వరి (అంబవరం)

* * *

పోటిబండ్ల విజయలక్ష్మిగారి సుదూర తీరాలు సీరియల్ చాలా రసవత్తరంగా నడుస్తున్నది. ముఖచిత్రం కార్టూను అద్భుతంగా వుంది.

రమణశిగు లక్ష్మీ నాగరాజేశ్వరి (నరసరావుపేట)

* * *

పోటిబండ్ల విజయలక్ష్మిగారి సుదూర తీరాలు ప్రారంభ సీరియల్ ఇంటరెస్టింగా పోతోంది. దీపావళి గురించి వేసినారు. వ్యాసాలు గొప్పగా ఉన్నాయి. దీపావళి జోక్స్ కడుపుబ్బ నవ్వించాయి.

చోడవరపు నాగేశ్వరరావు, (సికింద్రాబాదు)

* * *

నరకాసుర వధ ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం ఆంధ్రపత్రికలోని కథలన్నీ బాగున్నాయి. సుదూర తీరాలు సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది, జోక్స్ మాత్రం నవ్వు తెప్పించలేక పోతున్నాయి.

దోమర్ల లలిత కుమారి (నెల్లూరు)

## కథలు

19.10.79వ తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రిక శ్రీదేవి ముఖచిత్రముతో సర్వాంగ సుందరంగా ఉన్నది.

"హాస్యకేళి 'కథ'" చాలా బాపుంది. "ప్రేమపాశం", "నళిని" సీరియల్స్ మేము ఊహించని రీతిలో శరవేగంతో సాగిపోతున్నాయి.

పద్యాలలో అందిస్తున్నందుకు మీకు మా జోహార్లు. ఇంకా కార్టూన్స్ వెయ్యగలరని కోరుచున్నాం.

జె. చిన్న హోంబాల్, అత్తిలేని రామేందర్, శశికళ, శ్రీదేవి, సుధ (జగిత్యాల).

* * *

'కలకత్తా దుర్గ' ముఖచిత్రంతో వచ్చిన దసరా సంచిక వివాహిక జెవితి సంచికవలె పసందుగా ఉంది.

అన్నపూర్ణా—అరిక్కపూడి కథ బాగున్నా కథలో అతిశయం ఎక్కువగా ఉంది. లంబూ పిట్టీగా ఉండి నవ్వు పుట్టిస్తుంది. 'నళిని' చిత్ర మలుపులు తిరుగుతూ కొత్తదనం సంతరించుకుంది, దసరా కార్టూన్లు సరదాగా ఉన్నాయి.

పత్రిక ఇంత బాగా తీర్చి దిద్ది అందించిన మీకు కృతజ్ఞతలు.

మాటికొన ప్రకాష్ (విజయనగరం)


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

